# మోక్ష సాధన

అయమాత్మా బ్రహ్మ

అహం బ్రహ్మాస్మి

ఏకమేవాద్వితీయం బ్రహ్మ

ప్రజ్ఞానం బ్రహ్మ



తత్త్వమసి

ఓమిత్యేకాక్షరం బ్రహ్మ

సర్వంఖల్విదం బ్రహ్మ

సత్యంజ్ఞానం అనంతంబ్రహ్మ

వడ్డి వరలక్ష్మి

C.V. Padmini
24/8/98

# శ్రీవారి దివ్యదర్శన స్తోత్రము

ఓం శిరం వజ్రకిరీటం -
వదనం శశివర్ణ ప్రకాశం!
ఫాలే కస్తూరి శ్రీగంధ తిలకం -
కర్ణం వజ్రకుండల శోభితం!
నాసికా సువాసిత పుష్పదళం -
నయనే శశిమండల ప్రకాశం!
కంఠే సువర్ణ పుష్పమాలాలంకృతం -
హృదయే శ్రీనివాస మందిరం!
కరం కరుణాభయసాగరం -
భుజే శంఖ చక్ర గదా ధరం!
సువర్ణ యజ్ఞోపవీత భూషణం -
సర్వాంగే స్వర్ణ పీతాంబరం ధరం!
పాదం పరమానందరూపం -
సర్వపాప నివారితం!
సర్వం స్వర్ణమయం -
నామితం శ్రీ వేంకటేశం!
శ్రీనివాసం - తిరుమలేశం -
నమామి శ్రీ వేంకటేశం!

---

ఈ స్తోత్రము ప్రతినిత్యం పఠించినవారికి
ఆయురారోగ్య అష్టఐశ్వర్యములు కలుగును.



సద్గురు స్వామి శ్రీరామనాథ్

## అంకితము

నేనేమియు ఉన్నత విద్య నభ్యసించనటువంటి దాని నైనప్పటికిన్నీ, సగుణారాధన పూర్తి చేసుకొని, జ్ఞాన పిపాసినై సద్గురువుకై తిరుగాడుచుండ నా అదృష్టవశమున పూర్వపుణ్య పరిపాక ఫలితమున, ఈశ్వరానుగ్రహము వలన శ్రీమహాయోగి శ్రీరామనాథ్ గారు పుత్రికావాత్సల్యముతో తత్త్వమార్గదర్శి అయి, నాకు జ్ఞాన భిక్ష పెట్టి తరింప చేసిన శ్రీసద్గురు దేవునకు వినయ పూర్వ ప్రణామములతో అంకిత మొనర్చుచున్నాను.

ఇట్లు
వడ్డివరలక్ష్మి
శిష్యరేణువు.

# మోక్ష సాధన

అయమాత్మా బ్రహ్మ

అహం బ్రహ్మాస్మి

ఏకమేవాద్వితీయం బ్రహ్మ

ప్రజ్ఞానం బ్రహ్మ



తత్త్వమసి

ఓమిత్యేకాక్షరం బ్రహ్మ

సర్వంఖల్విదం బ్రహ్మ

సత్యంజ్ఞానం అనంతంబ్రహ్మ

వడ్డి వరలక్ష్మి
12-10-322/2, సీతాఫల్‌మండి, సికింద్రాబాద్-500 061.
ఫోను నెంబరు : 7606687

ముముక్షువుకు ఉచితము
అమూల్యం.

# ప్రకాశకులు

చి. వడ్డి వేంకటరమణ నాగేశ్వర దత్తు

మరియు

చి. వడ్డి శేఖరు

వారికి వారికుటుంబ సభ్యులకు శ్రీగురు దేవుడు ఆయురారోగ్య ఐశ్వర్యాభి వృద్ధి లిచ్చి, భక్తి జ్ఞాన వైరాగ్యములు కలుగ చేయవలసినదిగా ప్రార్థిస్తున్నాను.

వడ్డి వరలక్ష్మి

# విషయ సూచిక


| క్రమ సంఖ్య | అధ్యాయములు | పేజి నెంబర్లు |
|---|---|---|
| 1. | వాసనలు - కర్మ - జన్మ | 16 |
| 2. | మానవజన్మ ప్రాముఖ్యత | 19 |
| 3. | శుభేచ్ఛ - గురు అన్వేషణ | 20 |
| 4. | సద్గురు దర్శనము - గురుబోధ | 21 |
| 5. | పంచకోశవిచారణ - అహంబ్రహ్మాస్మి | 24 |
| 6. | శరీరత్రయ వివరణ | 27 |
| 7. | తత్త్వ మసి | 29 |
| 8. | సాధనక్రమము | 30 |
| 9. | సాధనలో అవరోధాలు<br>సవికల్ప సమాధి - నిర్వికల్ప సమాధి | 41 |
| 10. | సప్తజ్ఞాన భూమికలు | 42 |
| 11. | నిర్వికల్ప సమాధి పొందిన ముముక్షువు<br>సాధన క్రమము, స్థితి | 47 |
| | ఒకటవ అనుబంధము (గురుపూజ నామావళి) | 51 |
| | రెండవ అనుబంధము (గీతా సందేశము) | 64 |
| | మూడవ అనుబంధము<br>(జ్ఞాన రత్నాలు) | 65 |

# బ్రహ్మజ్ఞానావలీమాలా

*(బ్రహ్మనామావలీమాలా)*

సకృత్ శ్రవణమాత్రేణ బ్రహ్మజానం యతో భవేత్,
బ్రహ్మజ్ఞానావలీమాలా సర్వేషాం ముక్తిసిద్ధయే.
అసఙ్గోఽహమసఙ్గోఽహమసఙ్గోహం పునః పునః,

సచ్చిదానన్దరూపోఽహమహమే వాహావ్యయః.
నిత్యశుద్ధవిముక్తోఽహం నిరాకారోఽహమక్షరః,

భూమానన్దస్వరూపోఽహమహమేవాహ మవ్యయః.
నిత్యోఽహం నిరవద్యోఽహం నిరాకారోఽహమక్షరః,
పరమానన్దరూపోఽహమహ మేవాహ మవ్యయః.

శుద్ధచైతన్యరూపోఽహమాత్మారామోఽహమేవ చ,
అఖణ్డానన్దరూపోఽహ మహమేవాహ మవ్యయః

స్వయం ప్రకాశరూపోఽహం చిన్మయోఽహం వరోఽస్మ్యహం,
అద్వైతానన్దరూపోఽహ మహమెవాహ మవ్యయః.

ప్రత్యక్ చైతన్యరూపోఽహం శాన్తోఽహం ప్రకృతేః పరః,
శాశ్వతానన్దరూపోఽహ మహమేవాహ మవ్యయః.

తత్త్వాతీతః పరాత్మాహం మధ్యాతీతః పరః శివః.
మాయాతీతః పరంజ్యోతి రహమేవాహ మవ్యయః.

నామరూపవ్యతీతోఽహం చిదాకారోఽహ మచ్యుతః,
సుఖ ప్రకాశరూపోఽహ మహమేవాహ మవ్యయః.

ఓమ్

శ్రీ సద్గురోభ్యోనమః

# నివేదన

చాలామంది వేదాంతమంటె భయపడుతారు. అది తెలుసుకోవటం వలన సన్యాసులవుతారని ఒక మూఢనమ్మకము. ఉపనిషత్తులు, వేదాంత పంచదశి,యోగవాసిష్ఠము, వివేకచూడామణి, అష్టావక్ర గీత మొదలయిన గ్రంథములు సంస్కృతములో వాటి తర్జుమా తెలుగు భాషలో ఉన్నప్పటికి చాలామందికి అందుబాటులో లేవు. అవి చదివినా అర్థం చేసుకోవటం భాషా పరిజ్ఞానం లేని వారికి చాలా కష్టము, సంస్కృతంలోనూ గ్రాంధిక భాషలో ఉండటం వలన పైగా వేదాంతంలో వచ్చు పద జాలము కొంచెం కష్టంగా ఉంటుంది.

అద్వైత జ్ఞానము కొంగున మూట కట్టుకొని నీ ఇష్టము వచ్చినటుల మెలుగుమని చెప్పారు శ్రీరామకృష్ణ పరమహంసులవారు. "బ్రహ్మ సత్యం, జగత్తు మిథ్యా" "అనిన్ని, జీవో బ్రహ్మైవ నావరః నేహ నానాస్తి కించన" అని బోధించారు శ్రీ శ్రీ జగద్గురువు శంకరాచార్యులవారు.

వేదాంత బోధంత నేను సద్గురువు వద్ద నేర్చుకున్న దానినిబట్టి, నా అనుభవాలు బట్టి ఏ అరణ్యాలకు పోనక్కర లేకుండా సంసారంలోనే ఉంటూ, సంసారంలో చిక్కుకోకుండా దానికి అంటుకోకుండా మనో నిగ్రహంతో, ఇంద్రియాలు అంతర్ముఖం చేసుకుంటూ, వాసనాక్షయం చేసుకొని, అహంకార మమకారములు విడనాడి, చిత్తశుద్ధి చేసుకొని, సకల సంకల్ప రాహిత్యం చేసుకుంటూ, ద్వైత భావన విడనాడి, శుద్ధతత్త్వము నాశ్రయించి, నిర్వికల్ప సమాధి పొందవచ్చును. దీనికి సంసారము ఏమీ అడ్డురాదు. అరణ్యాలకు వెళ్ళినప్పటికి అక్కడ కూడా మనలో ఉన్న బుద్ధి, మనస్సు, అహంకారము, చిత్తము, ఇంద్రియాలు కూడానే ఉంటాయి. అవి సాధనకు అడ్డుతగులుతూనే ఉంటాయి. మనలో ఉన్న శత్రువులను జయించి ద్వైతభావన నశింపు చేసుకొని నేను పరమాత్మ కంటె భిన్నుడను కాను అని బోధించునదే వేదాంతము. ఇది కేవలము అనుభవనీయమే, తీవ్ర సాధనతో. నేనంటే ఎవరు? నాస్వరూపమేది? పరమాత్మ స్వరూపమేది? అనేది

స్వానుభవము ద్వారా తీవ్ర సాధన వలన రెండింటికి అభేదమును తెలుసు కొనుటయే జ్ఞానము. ఇది ముఖ్యంగా భావశుద్ధి వలన, చిత్తైకాగ్రత వలన గురుబోధ వలన, తీవ్ర సాధనవలననే సాధ్యమవుతుంది.

ఈ పుస్తకము భాషా పరిజ్ఞానము గల వేదాంతులకు ఉద్దేశ్యపడినది కాదు. నేనుకేవలం ఆరవతరగతి వరకూ మాత్రమే చదువుకున్నాను. ఉన్నత విద్యాభ్యాసము కుటుంబ పరిస్థితులవలన చేయలేదు. నేను హరితస వంశీయులుయోగాభ్యాసులు అయిన శ్రీశ్రీ పోతుకూచి వెంకటరమణయ్య గారు, బాపట్ల, తృతీయ కళత్రమున ప్రథమ సంతానముగా జన్మించితిని. కౌశికస గోత్రీయులు కీ.శే. వడ్డి మార్కండేయులు గారి ద్వితీయ పుత్రుడు జగన్నాధరావుగారితో నా వివాహమైనది. నాకు సంస్కృతమునగాని, తెలుగులో వ్యాకరణమందుగాని ప్రవేశము లేదు. కాబట్టి, వాడుక భాషలో వేదాంత మంటే ఏమిటో తెలియని వారికి కూడా తేట తెల్లమగునట్లుగా శ్రీగురువుగారి ఆదేశాను సారముగా వ్రాయబడినది. వారు అనేక గ్రంధములు వ్రాసి ఉన్నారు. ఆ గురు శక్తే ఈ విధంగా వ్రాయించింది. ఇందులో ఏమయినా తప్పులున్నచో పాఠకులు నన్ను మన్నించగలరు. ఈ పుస్తకము పాఠకుల సాధనకు, బ్రహ్మవిద్య అంటే ఏమిటో తెలుసుకొనుటలో ఏ కొద్ది మందికైనా ఉపయోగబడినట్లయితే నా శ్రమ ఫలించినట్లే.

ఈ పుస్తకము చివర గురుపూజ (నామావళి మంత్ర పుష్ప సహితముగా) శ్రీ సద్గురు స్వామి రామనాథ్ వేదాంత ప్రచారమండలి, కర్నూలు వారి సౌజన్యంతో ఒకటవ అనుబంధముగా చేర్చడమయినది. వారందరకు నా ధన్యవాదములు.

తత్త్వబోధ చేసి స్వరూప జ్ఞానము కలుగ చేసిన శ్రీ గురువు దేవుడు భగవత్స్వరూపుడు. సంసారబంధ మోహమునుండి రక్షించువాడు. ఆ గురువేతండ్రి, తల్లి, బంధువు, ఇష్టదైవము గురుకృప లేనిదే స్వస్వరూప జ్ఞానము కలుగదు. ఆయన పరమ శాంతుడు. ఆగురువే బ్రహ్మ, విష్ణువు, శివుడై ఉన్నాడు. అటువంటి గురువు సదావందనీయుడు. అందుచే నిత్యపారాయణనిమిత్తము, శ్రీ వ్యాసమహర్షి, శ్రీ దక్షిణమూర్తి, గురుగీతలోని శ్రీ సద్గురువు, శ్రీ దత్తాత్రేయులవారి స్తోత్రములను ముందు పొందు పరచితిని. ఇవి నిత్యము పారాయణ చేయుటలో ముముక్షువులకు ఉపయోగ బడగలదు.

నా మూడవ కుమారుడు కీ.శే. భానుకుమార్, చిన్న తనముననే శ్రీ సద్గురు కృపవలన అహంబ్రహ్మాస్మి, తత్త్వమసి మహా వాక్యముల నుపదేశము పొంది, నిర్వికల్ప సమాధిపొంది, ఎక్కౌంట్సు ఆఫీసరుగా తామరాకు మీద నీటి బొట్టువలె, విధ్యుక్త ధర్మములు సక్రమముగా, జ్ఞానమార్గములో పయనిస్తున్నప్పటికి, నిర్వర్తిస్తు తన 32 వ సంవత్సరముల వయస్సులోనే, ది. 13-6-1994 ఒక ఉన్నత కంపెనీలో అసిస్టెంటు మేనేజరు (కాస్టింగు) ఉద్యోగము రాగా, దానిలో చేరుటకు ముంబాయి వెడలు చుండగా, కారు ప్రమాదమువలన, నాకుమారుడు, కోడలు, మనుమరాలు బ్రహ్మైక్యము నొందినారు. వారికి ఆత్మశాంతిని కలుగచేయవలసినదిగా శ్రీ గురుదేవుని ప్రార్థిస్తున్నాను. అతను ఎల్లప్పుడూ విధ్యుక్త ధర్మములు లోటు లేకుండా పయనిస్తున్నప్పటికి, తన బల్లపై కొన్ని ఆధ్యాత్మిక నియమములు వ్రాసి పెట్టుకొని అవి నిత్యము ఆచరించినవ్యక్తి. ఆ ఆధ్యాత్మిక ధర్మములు పాటించుట వలన విద్యుక్త ధర్మములు ఇంకను సమర్థవంతముగా పని చేయుటకు తోడ్పడినవని అనుభవము ద్వారా వ్యక్త పరచెడి వాడు. ఆ కాగితముపై వ్రాసిపెట్టుకున్న అంశములు పాఠకుల ఉపయోగార్థమై ఈ పుస్తకములో రెండవ అనుబంధముగా చేర్చుచున్నాను.

శ్రీ సద్గురు దేవుల మేలు కొలుపు పాటలు, ఇతరములయిన శ్రీ సద్గురు దేవులు సంక్షిప్తముగా వ్రాసిపెట్టుకొనియున్నవేదాంత పాటలు వారి చిత్తు ప్రతులనుండి సేకరించి గురునామావళి (ఒకటవ అనుబంధము) తర్వాతపాఠకుల ఉపయోగార్థము చేర్చడమయినది.

ఈ పుస్తకమునకు మూల్యము లేదు. ముముక్షువులకు ఉచితముగా పంపబడును. అయితే తమ చిరునామా వ్రాసిన కవరుపై తగు తపాలా బిళ్లలు అంటించి పంపినట్లయితే స్టాకు పరిమితమును బట్టి ఉచితముగా పంపబడును.

ఈ పుస్తకమును అందముగా తీర్చిదిద్ది తక్కువ వ్యవధిలో అందజేసిన గౌరవనీయులు ఉన్నత సంస్కార వరులు అయిన శ్రీశ్రీ దేవులపల్లి అజయ్ గార్కి, వారి జాయ్ 'ఎన్' జాయ్ ఆఫ్‌సెట్ ప్రింటింగ్ ప్రెస్‌లో పని చేయు సిబ్బందికి ఎంతో ఋణపడి ఉన్నాను. వారికి భగవంతుడు ఆయురారోగ్య ఐశ్వర్యాభివృద్ధి కలుగ చేయవలసినదిగా ప్రార్థిస్తున్నాను.

**11.10.1997.** విజయ దశమి
ఈశ్వరనామ సంవత్సరము.

వడ్డి వరలక్ష్మి

# ధ్యాన శ్లోకములు

1. *ఓమ్ ఓమ్ ఓంకార రూపం త్ర్యహ మితి చపరంయత్స్వ రూపం తురీయం*
*త్రైగుణ్యా తీతనీలం కలయతి మనసస్తేజ సిందూర మూర్తిం*
*యోగీంద్రా బ్రహ్మ రంధ్రే సకలగుణమయం శ్రీహరేన్ద్ర ణ సంగం*
*గంగంగంగం గణేశం గజముఖ మభితో వ్యాపకం చిన్తయన్తి ॥*

తాత్పర్యము : ప్రణవ స్వరూపుడును, తురీయ రూపుడును, త్రిగుణాత్మక మగు ప్రకృతికి పరమైనవాడును, మనస్సును ప్రకాశింపచేయువాడును, తేజోరూపుడును, సిందూర కాంతి గలవాడును, సకల కళ్యాణ గుణ మయుడును, సర్వవ్యాపియునగువిఘ్నేశ్వరుని యోగులు బ్రహ్మ రంధ్రమున పరబ్రహ్మైక్యము కొరకై ధ్యానించుచున్నారు.

2. *ఓం వ్యాసాయ యతివర్యాయ విద్యావిగ్రహ ధారిణే ।*
*నమస్తే పరమానన్దదాయినే పరమాత్మనే ॥*

తాత్పర్యము : యతులలో కెల్ల శ్రేష్ఠుడు, విద్యనే రూపముగల వాడు, పరమానంద పరమాత్మ స్వరూపుడగు శ్రీవ్యాస మహర్షికి వందనములు.

3. *ఓం వ్యాసం వసిష్ఠ నప్తారం శక్తేః పౌత్రమ కల్మషం ।*
*పరాశరాత్మజం వన్దే శుకతాతం తపోనిధిమ్॥*

తాత్పర్యము : వసిష్ఠుని ముని మనుమడును, శక్తి యొక్క మనుమడును, పరాశరుని పుత్రుడును, శుకుని తండ్రియు, తపోనిధియు, కలుష రహితుడునగు శ్రీ వేదవ్యాస మునీంద్రునకు నమస్కారములు.

4. *ఓం వ్యాసాయవిష్ణు రూపాయ వ్యాసరూపాయ విష్ణవే ।*
*నమోవై బ్రహ్మ నిధయే వాసిష్ఠాయ నమోనమః ॥*

తాత్పర్యము : విష్ణు రూపుడగు వ్యాసునకు, వ్యాసరూపుడగు విష్ణువునకు, బ్రహ్మవిద్యానిలయుడగు శ్రీ వాసిష్ఠుడగు వ్యాసునకు నమస్కారములు.

# శ్రీ దక్షిణామూర్తి వారి స్తోత్రములు

**5.** *ఓమ్ స్ఫటికరజిత వర్ణం మౌక్తికీ యక్ష మాలాం*
*అమృత కలశ విద్యాం జ్ఞాన ముద్రాం కరాగ్రే*
*దధతమురగ కక్ష్యం చంద్ర చూడం త్రినేత్రం*
*విధృత వివిధ భూషం దక్షిణా మూర్తి మీడే ॥*

తాత్పర్యము : స్ఫటిక రజితములవంటి స్వచ్ఛమైన వర్ణము గలవాడును, ముత్యములతో చేయబడిన జపమాల కలవాడును, అమృత కలశము గైకొనిన వాడును, విద్యానిధియు, హస్తముల చివఱ చిన్ముద్ర ధరించిన వాడును, కక్ష్య భాగమున సర్పములు గలవాడును, శిరస్సుపై చంద్రుడు ఒప్పుచున్నవాడును, త్రినేత్రుడును, పెక్కు భూషణములు ధరించిన వాడును శ్రీ దక్షిణామూర్తిని స్తుతించెదను.

**6.** *మౌన వ్యాఖ్యా ప్రకటిత పరబ్రహ్మ తత్త్వమ్*
*వర్షిష్ఠాంతే వసదృషి గణై రావృతం బ్రహ్మనిష్ఠైః*
*ఆచార్యేంద్రమ్ కరకలిత చిన్ముద్రమ్ ఆనందమూర్తిమ్*
*స్వాత్మారామమ్, ముదితవదనమ్, దక్షిణామూర్తి మీడే ॥*

తాత్పర్యము: మిక్కిలి వృద్ధులును, శిష్యులునూ అయిన ఋషుల సమూహాము చేత పరివేష్ఠింప బడినటువంటివన్నీ మౌనము చేతనే తత్త్వ బోధ చేయుచున్నటువంటిన్నీ, యువకుడునూ, కుడి చేతిలో చిన్ముద్ర ధరించిన వాడునూ, మూర్తీభవించిన ఆనంద స్వరూపుడునూ, తన స్వరూపమున రతి గొంటూ చిరునవ్వుతో ఉన్నటువంటి దక్షిణా మూర్తిని స్తోత్రం చేస్తున్నాను.

**7.** *విశ్వం, దర్పణ దృశ్యమాన నగరీతుల్యం, నిజాంతరతం*
*పశ్యన్, ఆత్మని మాయయా, బహిరివోద్భూతం యథానిద్రయా,*
*యస్సాక్షాత్కురుతే, ప్రభోధసమయే, స్వాత్మానమే వాద్వయం*
*తస్మై శ్రీ గురుమూర్తయే నమ ఇదం, శ్రీ దక్షిణామూర్తయే ॥*

తాత్పార్యము : ఆత్మయందు కల్పింబడిన, అజ్ఞానం చేత (మాయచేత) బయట కనిపించుచున్న దృశ్యజగత్తంతా అద్దంలో కనిపించు నగరం వంటిది అని, అది అజ్ఞాన కలుషితమయిన మనో కార్యమని, కాని తన నిజతత్త్వంలోనే ఉండి సర్వజగత్తు వాస్తవంలో కల్పింప బడినదిగా చూస్తూ తన స్వస్వరూపము కంటే రెండవ పదార్థం లేనిదిగా తన ఉనికిని గోచరింప చేయుచున్నాడో అటువంటి జగద్గురువు శ్రీ దక్షిణామూర్తి వారికి నమస్కారములు.

*8\. బీజస్యాంతరి వాంకురః, జగదిదం ప్రాఙ్ని ర్వికల్పం, పున*
*ర్మాయాకల్పిత దేశకాల కలనా వైచిత్ర్య చిత్రీకృతం*
*మాయా వీవ విజృంభయత్యపి, మహాయోగీ వయస్స్వేచ్ఛయా*
*తస్మై శ్రీ గురుమూర్తయే నమ ఇదం, శ్రీ దక్షిణామూర్తయే ॥*

**తాత్పర్యము :** విత్తనములో ఉన్న మొక్క, చెట్టు పూర్వము కనిపించపోయినట్లు, ఈ జగత్తు సమిష్టి పూర్వము లేక ఇపుడు మాయ చేత దేశకాలములు, చిత్ర విచిత్రముగా కనిపించబడినది. ఇది అంతా అజ్ఞానం చేత పరమాత్మ గారడి వానివలె అంతులేకుండా సృష్టి చేస్తున్నాడు అని అజ్ఞానంతో అందరు అనుకున్నప్పటికీ, వాస్తవంలో మహా యోగివలె, గురుమూర్తి శ్రీ దక్షిణామూర్తి తన నిరంజన తత్త్వము ఆరోపించబడి ఉన్నవని అట్టి జగత్తుతో సంబంధము లేక తన స్వరూపములో ఉన్న వారికి నమస్కారములు.

*9\. య స్యైవస్ఫురణం, సదాత్మకం, అసత్కల్పార్థ గంభాసతే*
*సాక్షాత్తత్త్వమ సీతి, వేద వచసా, యోబోధ యత్యాశ్రితాన్*
*యత్సాక్షాత్కరణార్భవేత్ నపునారావృత్తిః, భవాంభోనిధౌ*
*తస్మై శ్రీ గురుమూర్తయే నమ ఇదం, శ్రీ దక్షిణామూర్తయే ॥*

**తాత్పర్యము :** ఏ జగద్గురువు తనను ఆశ్రయించిన వారికి వేదాంత మహా వాక్యములచే వాస్తవంలో ఆ పరబ్రహ్మవే నీవు అని బోధిస్తున్నారో ఆ బోధను విన్న శిష్యులు ప్రత్యక్ష అనుభవం ద్వారా జనన మరణ రూప సంసార మనే సముద్రంలో మళ్లీ తిరుగాడటం అనేది సంభవించదో అటువంటి గురు మూర్తులయిన శ్రీ దక్షిణమూర్తి వారికి నమస్కారములు.

*10\. నానాచిద్రఘటోదరస్థిత మహాదీప ప్రభా భాస్వరం,*
*జ్ఞానం యస్యతు, చక్షురాది కరణద్వారా బహి స్స్పందతే,*
*జానామీతి, తమేవ భాంతం, అను భాత్యేతత్సమస్తంజగత్,*
*తస్మై శ్రీ గురుమూర్తయే నమ ఇదం, శ్రీ దక్షిణామూర్తయే ॥*

**తాత్పర్యము :** కుండలో ఉన్న జ్యోతి యొక్క కాంతి దానికున్న చిల్లుల ద్వారా ఏవిధంగా బైటికి ప్రకాశించు చున్నదో ఆ విధంగా తనలో నున్న ఆత్మ ప్రకాశమే కన్ను మొదలైన ఇంద్రియములద్వారా బయటకు గోచరించుట నేను తెలుసు కుంటున్నాను, చేస్తున్నాను అనే అనుభవం ద్వారా (జ్ఞానం ద్వారా) ఆ ఆత్మ తత్త్వ జ్ఞానమే అనుభవింప బడుచున్నదై ఈ జగత్తు సర్వమూ ఆత్మ తత్త్వ జ్ఞానమునే అనుసరించి ప్రకాశించుచున్నది. అటువంటి జ్ఞానస్వరూపుడైన శ్రీ జగద్గురుమూర్తి శ్రీ దక్షిణమూర్తి వారికి నమస్కారములు.

*11. దేహం ప్రాణమపీంద్రి యాణ్యపి చలాం బుద్ధించశూన్యం విదుః,*
*స్త్రీ బాలంధ జడోపమాస్తు, అహమితి భ్రాంతాభృశం వాదినః,*
*మాయాశక్తి విలాస కల్పిత, మహావ్యామోహ సంహారిణే,*
*తస్మై శ్రీ గురుమూర్తయే నమ ఇదం, శ్రీ దక్షిణామూర్తయే ॥*

తాత్పర్యము : ఆత్మ అంటే దేహమేననీ, ప్రాణమేననీ, ఇంద్రియాలని, మనస్సేననీ, శూన్యమేననీ భ్రాంతిలో పడి అజ్ఞానంచే వాదించే వారు అయిన స్త్రీలు, బాలురూ, అంధులూ, జడులూ వారియొక్క మాయ చేత కల్పింపబడిన అంతులేని మోహమును సంహరించునటువంటి జగద్గురువు శ్రీ దక్షిణామూర్తి వార్కి నమస్కారములు.

*12. రాహుగ్రస్త దివాకరేందు సదృశః మాయా సమాచ్ఛాదనాత్,*
*సన్మాత్రః కరణోప సంహారణతః యోఽభూత్ సుషుప్తః పుమాన్,*
*ప్రాగస్వాప్సమితి, ప్రబోధసమ యే, యఃప్రత్యభిజ్ఞాయతే,*
*తస్మై శ్రీ గురుమూర్తయే నమ ఇదం, శ్రీ దక్షిణా మూర్తయే ॥*

తాత్పర్యము : ఏ జీవుడు వాస్తవంలో సత్తా మాత్రుడయినప్పటికీ రాహుగ్రహం చేత మింగబడిన సూర్యచంద్రుల వలె అజ్ఞానం చేత బాగా కప్పబడినందువలన ఇంద్రియములు వాటి ప్రవృత్తి నుండి తాత్కాలికంగా విరమించుకొని విశ్రాంతి తీసుకొంటున్నందువల్ల నిద్రపోయి, (సుషుప్తి) తిరిగి నిద్రలేచినపుడు తన వెనుకటి స్థితిని జ్ఞాపకం చేసుకుంటున్నాడో అటువంటి జీవుడు నిజానికి సత్తా మాత్రుడే అని భోదించే జగద్గురువు శ్రీ దక్షిణమూర్తి వారికి నమస్కారములు.

*13. బాల్యాదిష్వపి, జాగ్రదాదిషు, తథా సర్వాస్వ వస్థాస్వపి,*
*వ్యావృత్తాను అనువర్తమానం, అహమితి అంతస్స్ఫురంతం సదా,*
*స్వాత్మానం, ప్రకటీ కరోతి భజతాం, యోభద్ర యాముద్రయా*
*తస్మై శ్రీ గురుమూర్తయే నమ ఇదం, శ్రీ దక్షిణామూర్తయే ॥*

తాత్పర్యము : బాల్యమూ, కౌమారము యౌవనము, వార్ధక్యము మొదలైన అవస్థలలోనూ, స్వప్న, సుషుప్తి అవస్థలలోనూ అదేవిధంగా ఎప్పుడు మారుతూ ఉండే సర్వ అవస్థలలోనూ మారకుండా ఉండే "నేను" అని అన్ని అవస్థలలో నూ స్ఫురిస్తున్నదియే నీ నిజ స్వరూపము (పరమాత్మ) అని ఏ జగద్గురువు భోధచేయుచుండెనో అట్టి శ్రీ దక్షిణమూర్తి వారికి నమస్కారములు.

**14.** *విశ్వం పశ్యతి, కార్యకారణతయా, స్వస్వామి సంబంధతః,*
*శిష్యాచార్య తయా, తథైవ పితృపుత్రాది, ఆత్మనా భేదతః,*
*స్వప్నే జాగ్రతివా, య ఏష పురుషః, మాయా పరిభ్రామితః,*
*తస్మై శ్రీ గురుమూర్తయే నమ ఇదం, శ్రీ దక్షిణా మూర్తయే ॥*

తాత్పర్యము : ఏ జీవుడు తాను సత్తామాత్రుడైనప్పటికీ, మాయలో పరిభ్రమిస్తున్న వాడై విశ్వమును కూడా కారణములు కల దానిని గాను అదే విధంగా స్వామి భృత్యుల సంబంధములు గలదిగానూ, ఆచార్య సంబంధములతోనూ, తండ్రికొడుకుమొదలయిన బంధుత్వాలుగానూ ఆత్మ చేతనే బేధం కలదానినిగా అజ్ఞానంతో సత్యమైన వానివలె చూస్తున్నాడు. అటువంటి వారిని తరింప చేయుటకై వారికి స్వస్వరూపము (ఆత్మ స్వరూపము) బోధ చేయుచున్న జగద్గురువు శ్రీ దక్షిణమూర్తి వారికి నమస్కారములు.

**15.** *భూరంభాంస్యనలోऽనిలోంబర మహర్నాథో హిమాంశుః పుమాన్,*
*ఇత్యాభాతి చరాచరాత్మకమిదం, యస్యైవ మూర్త్యష్టకం,*
*నాన్యత్కించన విద్యతే, విమృశతాం, యస్మాత్పరస్మాద్విభోః,*
*తస్మై శ్రీ గురుమూర్తయే నమ ఇదం, శ్రీ దక్షిణామూర్తయే ॥*

తాత్పర్యము : కదిలేది కదలనిదిగా కనిపిస్తున్న ఈ భూమి, నీరు, అగ్ని, వాయువు, ఆకాశము, సూర్యుడూ, చంద్రుడు, జీవుడూ, ఏ పరమాత్మ యొక్క ఎనిమిది రూపములు అని అజ్ఞానంలో అభాస కలుగుచున్నదో, వివేకం చేత ఆత్మా నాత్మలను వేరు చేసి సర్వ వ్యాపితమైన పరమాత్మ తత్త్వం, సర్వము అత్మ మయమే అన్న వాస్తవం కంటె వేరుకాదు. నామరూపాలు ఆత్మకాదు అని బోధచేయుచున్న అద్వితీయ ఆత్మస్వరూపులయిన జగద్గురువు శ్రీ దక్షిణమూర్తి వారికి నమస్కారములు.

**16.** *సర్వాత్మత్వమితి స్ఫుటీకృతమిదం, యస్మాదముష్మిన్స్తవే,*
*తేనాస్యశ్రవణాత్, తదర్థ మననాత్, ధ్యానాచ్చ, సంకీర్తనాత్,*
*సర్వాత్మత్వమహావిభూతి సహితం, స్యాదీశ్వరత్వం స్వతః,*
*సిద్ధ్యేత్తత్పునరష్టధా, పరిణతంచ ఐశ్వర్యమ వ్యాహతం ॥*

తాత్పర్యము : ఏ కారణం చేత స్తోత్రమందు ఇది సర్వమూ ఆత్మ మయమే నని నిశ్చయం గావింపబడినదో ఆ కారణం చేత ఈ స్తోత్ర బోధను శ్రవణం చేసినందువల్లనూ, దాని అర్థాన్ని మననం చేయుటవల్లనూ, అన్యోన్యం

ముచ్చటించుకోవటం వల్లనూ, సర్వము ఆత్మ మయమే నని నిశ్చయాత్మక ఆనందంతో సహితమై నేనే బ్రహ్మము అనే అనుభవం కూడా ముముక్షువు యొక్క అభ్యాసం వలన తనంతట తానే కలుగుతుంది. ఇంకా ఆ తత్త్వం గురించి శంకలేని నిశ్చయమున్నూ అష్టైశ్వర్యాలకు మించిన అభయం అనే విభవం కలుగుతుంది.

## గురు గీత

**17.** *సంసారవృక్షమారూఢాః పతన్తి నరకార్ణవే*
*యస్తానుద్ధరతే సర్వాం స్తస్మై శ్రీ గురువేనమః ॥*

తాత్పర్యము : సంసార రూప వృక్షమును ఎక్కిన వారై, అజ్ఞాన రూపమును సముద్రములో పడిపోవుచున్నారో అట్టి వారిని రక్షించుచున్న గురుదేవుని కొరకు నమస్కారములు.

**18.** *గురుబ్రహ్మ గురువిష్ణు గురుర్దేవో మహేశ్వరః*
*గురు స్సాక్షాత్పరబ్రహ్మ తస్మై శ్రీ గురవేనమః ॥*

తాత్పర్యము : శ్రీ సద్గురువే బ్రహ్మా, విష్ణువు, ఈశ్వరుడు, సాక్షత్ పరబ్రహ్మ. అట్టి గురుదేవుని కొరకై నమస్కారములు.

**19.** *అజ్ఞానతిరాన్ధస్య జ్ఞానాఞ్జనశలాకయా*
*చక్షురున్మీలితం యేన తస్మై శ్రీ గురువేనమః ॥*

తాత్పర్యము : అవిద్య అనేడి నేత్ర రోగముతో బాధపడుచున్న వానికి స్వరూప జ్ఞానము అనే కాటుక చేత వివేక వంతునిగా, జ్ఞానవంతునిగా ఏ గురువుచేత చేయబడెనో అట్టి గురువరునికి నమస్కారములు.

**20.** *అఖండ మండలాకారం వ్యాప్తం యేన చరాచరం*
*తత్పదం దర్శితం యేన తస్మై శ్రీ గురవేనమః ॥*

తాత్పర్యము : ఏ పరమాత్మచే అఖండ బ్రహ్మరూప స్థావర జంగ మాత్మక మగు ప్రపంచము వ్యాపింప బడెనో అట్టి సర్వజగదుపాధిక చైతన్య స్వరూపుడగు పరబ్రహ్మను ఏగురుదేవునిచే చూపింవబడెనో ఆగురుదేవునికి నమస్కారము.

**21.** *స్థావరం జంగమం వ్యాప్తం యత్కించిత్స చరాచరమ్*
*త్వపదం దర్శితం యేన తస్మై శ్రీ గురవేనమః ॥*

తాత్పర్యము : పర్వతాది రూపమైన, పశుపక్ష్య రూపమైన, చరాచరముతో గూడుకొన్నవి ఏపరమాత్మచే వ్యాపింపబడినవో ఆ చైతన్య స్వరూపుడవు నీవేయని ఏ గురుమూర్తి ఉపదేశించెనో ఆ గురుమూర్తికి నమస్కారములు.

**22.** *చిన్మయం వ్యాపితం సర్వం త్రైలోక్యం సచరాచరమ్*
*అసిత్వం దర్శితం యేన తస్మై శ్రీ గురవేనమః ॥*

తాత్పర్యము : చరాచరములతో కూడిన సమస్త లోకములు ఏ చిద్రూప పరబ్రహ్మచే వ్యాపింప బడినదో అది నీవే అని తెలిపిన శ్రీ సద్గురువుకు ప్రణామములు.

**23.** *నిమిషాన్ని మిషార్ధాద్వాయ ద్వాక్యాద్వై విముచ్యతే*
*స్వాత్మానం శివమాలోక్య తస్మై శ్రీ గురవేనమః ॥*

తాత్పర్యము : ఏ గురువు యొక్క తత్త్వ బోధవలన నిమిష కాలములో గాని అందులో సగము కాలములో గాని స్వ స్వరూపానుభవం కలిగి సంసార బంధమునుండి విడివడు చున్నాడో అట్టి మహా మహిమ సంపన్నుడగు శ్రీ గురుదేవునికి నమస్కరించుచున్నాను.

**24.** *చైతన్యం శాశ్వతం శాన్తం వ్యోమాతీతం నిరంజనమ్*
*నాద బిందు కళాతీతం తస్మై శ్రీ గురవేనమః ॥*

తాత్పర్యము : ఏ గురువు ప్రకాశరూపమైన జ్ఞాన రూపముగను, శాశ్వతునిగాను, సకల వృత్తి రహితముగను, గగనమునతిక్రమించినదిగను, మాయా మాలిన్యము లేనిదిగను చిత్కళల కంటె అతీతమైనదిగను ఉన్నట్టి పరబ్రహ్మ స్వరూపుడగు శ్రీ గురుదేవునికి నమస్కారములు

**25.** *నిర్గుణం నిర్మలం శాన్తం జంగమం స్థిరమేవచ*
*వ్యాప్తం యేన జగత్సర్వం తస్మై శ్రీ గురవేనమః ॥*

తాత్పర్యము : ఏ గురు స్వరూపము నిర్గుణమై, సర్వవ్యాపకమై సర్వకలుషిత రహితమై, పరిశుద్ధమై, పరమశాంతి స్వరూపమై ఉన్నదో అట్టి శ్రీ గురుదేవునికి నమస్కారములు.

**26.** *నపితా నచమే మాతా నబన్ధుస్సచదేవతా*
*సంసార మోహనాశాయ తస్మై శ్రీ గురవేనమః ॥*

తాత్పర్యము : ఆ గురువే తండ్రి, తల్లి, బంధువు, ఇష్టదైవము సంసార భ్రాంతిని నశింప చేయుచున్నాడు అటువంటి శ్రీ గురుదేవునకు నమస్కారము.

**27.** *యత్సత్త్వేన జగత్సత్త్వం యత్ప్రకాశేనభాతితత్*
*యదానన్దేన నన్దన్తి తస్మై శ్రీ గురవేనమః ॥*

తాత్పర్యము : శ్రీ గురు బ్రహ్మము యొక్క సత్త సర్వజగత్తుకు ఆధారము చెందియున్నది. ఆ సర్వజగత్తు ఆ గురు పరమాత్మ యొక్క ప్రకాశముచే భాసించుచున్నది. ఆ గురు బ్రహ్మము యొక్క ఆనందము చేతనే ఆనందించుచున్నారు. శ్రీ గురుస్వరూపము సత్తు, చిత్తు ఆనందము. అట్టి శ్రీ గురుదేవునికి నమస్కారములు.

**28.** *యస్మిన్ స్థిత మిదం సర్వం భాతి యద్భానరూపతః*
*యత్ప్రీత్యా ప్రియం పుత్రాదీ తస్మై శ్రీ గురవేనమః ॥*

తాత్పర్యము : శ్రీ గురు స్వరూపమందు ఈ విశ్వమంతయు స్థిరమై ఉన్నది. ప్రకాశించుచున్నది. పరమ ప్రేమ స్వరూపమయినది. అట్టి శ్రీ గురుదేవునకు నమస్కారములు.

**29.** *యేనేదం దర్శితం తత్త్వం చిత్తచైత్యాదికం తథా*
*జాగ్రత్స్వప్న సుషుప్త్యాది తస్మై శ్రీ గురవేనమః ॥*

తాత్పర్యము : చిత్తము, మనస్సు, బుద్ధి, అహంకారము వాటియొక్క సంకల్ప వికల్పములు, ఈ శరీరము పంచ భూతాత్మకమైనవన్నీ జడ పదార్థములు అయి ఉన్నవని, అందుచే ఈ స్థూల సూక్ష్మ కారణ శరీరములు తత్త్వములన్నిటిని విశద పరచి అవి అన్నియు సర్వ సాక్షి చైతన్య శక్తిచే ప్రవృత్తమయినవని, పరమాత్మ స్వరూపము బోధించెనో అట్టి శ్రీ గురుదేవులకు నమస్కారములు.

**30.** *యస్యజ్ఞాన మిదం విశ్వం నదృశ్యం భిన్న భేదతః*
*సదైక రూప రూపాయ తస్మై శ్రీ గురవేనమః ॥*

తాత్పర్యము : ఈ సర్వజగత్తు గురుబ్రహ్మ యొక్క జ్ఞానస్వరూపము జీవబ్రహ్మల భేదమువలన ఎప్పుడూ ఏకరూపం గల బ్రహ్మ స్వరూపియగు శ్రీ గురుదేవులకు నమస్కారములు.

**31.** *యస్యజ్ఞాతం మతం తస్యమతం యస్యన వేదసః*
*అనన్య భావ భావాయ తస్మై శ్రీ గురవేనమః ॥*

తాత్పర్యము : ఏ పరబ్రహ్మ స్వరూప జ్ఞానము లేకపోవుటచే ఈ విశ్వమంతయు (జగత్తు) తానై పూలదండలతో దారము విధంగా తెలియబడక ఉండెనో, అట్టి జగత్తు అద్వితీయ పరిపూర్ణబ్రహ్మము కంటె వేరు కాదు అని ఏ గురువు తత్త్వోపదేశము చేసి కృతార్థుడను చేసెనో అట్టి గురుదేవులకు నమస్కారములు.

**32.** *యస్మై కారణ రూపాయ కార్యరూపేణ భాతి యత్*
*కార్యకారణ రూపాయతస్మై శ్రీ గురవేనమః ॥*

తాత్పర్యము : కారణ స్వరూపుడగు పరమాత్మ కొరకు ఈ విశ్వము పరమాత్మ తన భోగముకొరకై సృష్టించెనో అంటే తానే సర్వజగత్తుగా ఆయెను. ఆ జగత్తు అంతయు భగవంతుని ఆధారము చేసుకొని ప్రకాశించుచున్నది. దీనిని బట్టి సర్వజగత్తు బ్రహ్మలకు, జీవేశ్వరులకునూ బేధము లేదు అని ఏ గురుదేవుడు తత్త్వబోధ చేయునో అట్టి శ్రీ గురుదేవులకు నమస్కారములు.

***33.** నానారూప మిదం విశ్వం నకేనాప్యస్తి భిన్నతా*
*కార్యకారణ రూపాయ తస్మై శ్రీ గురవేనమః ॥*

తాత్పర్యము : ఈ దృశ్యమాన విశ్వమంతయు నామరూపాద్యాత్మకమై ఉన్నది. అట్టి విశ్వము పరమాత్మ కంటె వేరుకాదు. అని పరిపూర్ణ తత్త్వబోధ చేయు శ్రీ గురుదేవులకు నమస్కారములు.

***34.** జ్ఞాన శక్తి సమారూఢ తత్త్వమాలావిభూషిణే*
*భుక్తి ముక్తి ప్రదాత్రే చ తస్మై శ్రీ గురవేనమః ॥*

తాత్పర్యము : స్వ స్వరూపజ్ఞానము పొందిన వాడున్ను, వేదాంత తత్త్వార్థములనెడి పుష్పమాలికయే ఆధారముగా గలవాడును, భుక్తి యుక్తులకును ఒసంగునట్టి విజ్ఞాన స్వరూపుడయిన శ్రీ గురుదేవులకు నమస్కారములు.

***35.** అనేక జన్మ సంప్రాప్తకర్మ బనవిదాహినే*
*జ్ఞానానల ప్రభావేన తస్మై శ్రీ గురవేనమః ॥*

తాత్పర్యము: అనేక జన్మలనుండి సంప్రాప్తమైన సకల కర్మబద్ధములనుండి స్వస్వరూపతత్త్వ జ్ఞానాగ్నిమహిమచే నిశ్శేషముగా దహింపబడునట్లుగా తత్త్వబోధ చేసిన శ్రీ గురుదేవులకు నమస్కారములు.

***36.** శోషణం భవ సింధోశ్చ దీపనం క్షర సమ్పదాం*
*గురోః పాదోదకం యస్య తస్మై శ్రీ గురవేనమః ॥*

తాత్పర్యము : ఏ గురుదేవుని యొక్క పాద తీర్థము గ్రహించుట వలన దాని మహిమచే సంసార సాగరము దాటించి సకల కర్మ బంధములు దహించి విముక్తుని చేయుచున్నదో అట్టి శ్రీ గురుదేవునకు నమస్కారములు.

***37.** నగురోరధికం తత్త్వం నగురోరధికం తపః*
*నగురోరధికం జ్ఞానం తస్మై శ్రీ గురవేనమః॥*

తాత్పర్యము : గురువుకంటే ఉత్తమ మయిన తత్త్వము లేదు. శ్రేష్ఠమయిన తపస్సు లేదు. శ్రీ గురువే బ్రహ్మము. ఆయన బ్రహ్మజ్ఞాన స్వరూపుడు. అటువంటి శ్రీ గురుదేవునికి నమస్కారములు.

*38. మన్నాథ శ్రీ జగన్నాథో మద్గురు శ్రీ జగద్గురుః*
*మమాऽऽత్మా సర్వ భూతాత్మా తస్మై శ్రీ గురవేనమః ॥*

**తాత్పర్యము :** శ్రీ గురుదేవుడే నాకు రక్షకుడు. ఆయనయే జ్ఞాన సమృద్ధిగల జగద్గురువు. నాలోనున్న ఆత్మయే సర్వభూతములలోనున్నది. బేధములేదు. నువ్వు అన్నిటిలోనూ ఉన్నావు అన్నీ నీలో ఉన్నవి అని తత్త్వబోధ చేయు శ్రీగురు దేవునికి నమస్కారములు.

*39. గురు రాది రనాదిశ్చ గురుః పరమ దైవతమ్*
*గురు మంత్ర సమోనాస్తి తస్మై శ్రీ గురవేనమః ॥*

**తాత్పర్యము :** శ్రీ గురుదేవుడు సకల జగత్తు మూలకారణుడు. వారికి ముందు మరియొక వస్తువు లేదు. ఆయన సర్వులకు పరమదైవతం. గురు మంత్రముకంటే శ్రేష్ఠమయిన ఇంకొక మంత్రము లేదు. అటువంటి శ్రీ గురుదేవులకు నమస్కారములు.

*40. ఏకఏవ పరోబన్ధుర్విషమే సముపస్థితే*
*గురుస్సకల ధర్మాత్మా తస్మై శ్రీ గురవేనమః ॥*

**తాత్పర్యము :** మహా సంకటకరకమైన విపత్తు పడుచుండగా సకల ధర్మ స్వరూపుడు గురువొక్కడే. శ్రేష్ఠుడయిన బంధువు. ఇతరులు నిస్సాహాయులు. ఈ సంసార సాగరమనెడి మహాదుఃఖమును దాటించి జన్మపరంపరలనుండి తప్పించి, మోక్ష ప్రదమైన స్థితికి చేర్చువారు ఆ గురువొక్కడే. అట్టి శ్రీ గురుదేవులకు నమస్కారములు.

*41. గురు మధ్యేస్థితం విశ్వం విశ్వమధ్యే స్థితో గురుః*
*గురు ర్విశ్వంన చాన్యోऽస్తి తస్మై శ్రీ గురవేనమః ॥*

**తాత్పర్యము :** సర్వజగత్తు శ్రీ గురు పరబ్రహ్మ యందు స్థితమై ఉన్నది. అట్టి విశ్వ మధ్యమందు శ్రీ గురు బ్రహ్మము స్థితమై ఉన్నాడు. కాబట్టి సర్వజగత్తు గురు స్వరూపమే. మరియొక పదార్థము లేదు. అటువంటి సకలాత్మ బ్రహ్మస్వరూపులయిన శ్రీ గురుదేవునకు నమస్కారములు.

*42. భవారణ్య ప్రవిష్టస్య దిజ్మోహ భ్రాన్త చేతసః*
*యేన సందర్శితః పన్థాః తస్మై శ్రీ గురవేనమః ॥*

**తాత్పర్యము :** సంసారమనెడి ఘోరమైన అడవిలో ప్రవేశించి దిక్కు తెలియక భ్రమించిన మనస్సుకల దీన జనులను ఆశ్రయమిచ్చి తత్త్వభోధ చేసి స్వస్వరూప విజ్ఞానం కలిగించిన ఏ కరుణామూర్తియైన గురువు కలడో అట్టి శ్రీ గురుదేవులకు నమస్కారములు.

*43. తాపత్రయాగ్ని తప్తానామ శాంతప్రాణినాం ముదే*
*గురు రేవ పరా గంగా తస్మై శ్రీ గురవేనమః ॥*

**తాత్పర్యము :** ఆధ్యాత్మిక, ఆధి భౌతిక, ఆధి దైవికములను అగ్ని తాపములు అనుభవించుచూ, శాంతి లేక అల్లాడుచున్న జనుల సంతోషము కొరకు వారికి ఏ గురుదేవుడు తత్త్వ బోధ చేసి, స్వస్వరూప విజ్ఞానము కలిగించిన ఏ గురువు అయితే ఉన్నారో అట్టి గురు దేవులకు నమస్కారములు.

*44. అజ్ఞానేనా హి నా గ్రస్తాః ప్రాణినస్తాన్ చికిత్సకః*
*విద్యా స్వరూపోభగవాన్ తస్మై శ్రీ గురవేనమః ॥*

**తాత్పర్యము :** ఏ జీవులు అజ్ఞానమనెడి కాల సర్పముచే కరవబడి జన్మ పరంపరలో చిక్కుకొనినారో అట్టి వారి అజ్ఞాన మనెడి వ్యాధిని తత్త్వ బోధ అనే చికిత్స ద్వారా, స్వస్వరూప విజ్ఞానము కలిగించి మోక్షప్రాప్తికి ఏ గురువు అజ్ఞాన కాల సర్ప విషకారి అగుచున్నాడో అట్టి శ్రీ గురువు దేవులకు నమస్కారములు

*45. హీతవే జగతామేవ సంసారార్ణవ సేతవే*
*ప్రభవే సర్వ విద్యానాం శంభవే గురవేనమః ॥*

**తాత్పర్యము :**సర్వలోకములకు కారణముగనే ఉన్న వాడును సంసారమను భయంకర సముద్రమునకు వారధిగను, సమస్త విద్యలకు రాజైన వాడును, సర్వశుభంకరుడగు శంకరుడుగనున్న ఆ గురుదేవులకు నమస్కారములు.

*46. ధ్యానమూలం గురోర్మూర్తిః పూజా మూలం గురోఃపద*
*మన్త్ర మూలం గురోర్వాక్యం ముక్తి మూలం గురోఃకృపా ॥*

**తాత్పర్యము :** శ్రీ గురుదేవుని ఆకారము (స్వరూపము) ధ్యానించవలయును (ధ్యేయము) గురుమూర్తి యొక్క పాదములు అర్చన చేయవలయును. గురువు యొక్క తత్త్వోపదేశము మహామంత్రము. అట్టి గురు పరమాత్మ యొక్క దయ మోక్షమును కల్గిస్తున్నది. అది సాధనచే సంపాదింప వలెను.

*47. సప్తసాగర పర్యన్త తీర్థ స్నాన ఫలంతు యత్*
*గురోః పాదోద బిందోశ్చ సహస్రాం శేనాతత్ఫలమ్ ॥*

**తాత్పర్యము :** గురు పాదములయొక్క పవిత్ర తీర్థములోని బొట్టు యొక్క సహస్రాంశము భక్తితో విశ్వాసముతో సేవించుటవలన సప్తసాగరములు, సకల పుణ్య తీర్థములందలి స్నాన ఫలము కంటె అధికము.

**48.** నిత్యానందం పరమసుఖదం కేవలం జ్ఞానమూర్తిం
విశ్వాతీతం గగన సదృశం తత్త్వమస్యాది లక్ష్యం
ఏకం నిత్యం విమల మచలం సర్వధీ సాక్షి భూతం
భావాతీతం త్రిగుణరహితం సద్గురుంతం నమామి ॥

**49.** ఓం, నమో బ్రహ్మా దిభ్యో బ్రహ్మ విద్యా సాంప్రదాయ
కర్తృభ్యో వంశ ఋషిభ్యో గురుభ్యోనమో మహద్భ్యః
సర్వోపద్రవ రహిత ప్రజ్ఞాన ఘనః, ప్రత్య గర్థో బ్రహ్మై వాహమస్మి ॥

## శ్రీదత్తాత్రేయులవారి స్తోత్రము

**50.** వరదః కార్తవీర్యాదీ రాజరాజ్య ప్రదోఽనఘః
విశ్వశ్లాఘ్యోఽ మితాచారో దత్తాత్రే యో మునీశ్వరః ॥

**51.** పరాశక్తి పదాశ్లిష్టో యోగానందః సదోన్మదః
సమస్తవైరి తేజోహృత్ పరమామృత సాగరః ॥

**52.** అనసూయా గర్భరత్న, భోగమోక్ష సుఖప్రదః
శ్రీపాద వల్లభః పాతు శ్రీనృసింహ సరస్వతీ ॥

## శాంతి మంత్రములు

**53.** ఓం పూర్ణ మదః పూర్ణమిదం పూర్ణాత్పూర్ణ ముదచ్యతే
పూర్ణస్యపూర్ణ మాదాయా పూర్ణ మేవావశిష్యతే ॥

**54.** ఓం సహనావవతు, సహనౌభునక్తు, సహవీర్యం
కరవా వహై తేజస్వినావధీతమస్తు మా విద్విషావహై ॥
ఓం శాన్తి శాన్తి శాన్తిః ॥

# వాసనలు - కర్మ - జన్మ

పిపీలకాది బ్రహ్మ పర్యంతము ప్రతి జీవి జన్మించిన లగాయతు మరణించే వరకు ఏ కార్యం చేసినా తన దుఃఖ నివృత్తి కొరకూ తన ఆనందం కొరకే చేస్తున్నాడు. ఆ చేసిన కర్మ ఫలితాలను అనుభవించటానికి మరల ఇంకొక శరీరము ధరించి జన్మ తీసుకుంటున్నాడు. ఆ జన్మ మానవ జన్మకావచ్చు లేదా క్రిమి కాటకాదుల, చతుష్పాద జన్మకావచ్చు, వృక్షజన్మ కూడా కావచ్చు. ఈ జన్మ తాను చేసిన కర్మ ఫలితాల మీద ఆధారపడుతుంది. సత్కర్మలకు సుఖము, దుష్కర్మలకు కష్టాలు వస్తాయి. ఈ విధంగా కర్మ, జన్మ మరణాలు అనే చక్రంలో తిరుగుతూ అనేక యోనిలలో జన్మిస్తూ, మరణిస్తూ సంసార చక్రభమణలో చిక్కుకుంటాడు. కష్టాలు వచ్చినప్పుడు ఓ భగవంతుడా ఈ కష్టాలు నాకెందుకిచ్చావయ్యా అని ఆయనని, కష్టం కలిగించిన వారిని దూషిస్తూ, సుఖాలు వచ్చినపుడు తన ప్రయోజకత్వం వల్ల వచ్చినవని అహంకరిస్తూ, కష్టాలు కల్గినపుడు వాటి నివారణకు భగవంతునికి మొక్కులు, మొక్కు కుంటూ భగవంతునితో బేరాలు ఆడుతూ ఉంటాడు. ఈ కష్టాలు తన దుష్కర్మలవల్ల వచ్చినవేననే జ్ఞానం లేక.

ఈ విశ్వ ప్రపంచమంతా కర్మ సిద్ధాంతంపైనడుస్తోంది. ఈ విశ్వ ప్రభుత్వంలో మంచి పనికి మంచి దుష్కర్మలకు చెడు సంప్రాప్తిస్తాయి. తాటి టెంక నాటి కొబ్బరి చెట్టు మొలవ మంటె మొలవదు కదా! తాటి చెట్టే మొలుస్తుంది. "పరోప కారః పుణ్యాయ పాపాయ పరపీడనం" అని మరచి పోయి కష్టాలు వద్దను కుంటేనే స్వార్థంతో పావ కర్మాలు చేస్తాడు. సుఖాలు కావాలని కోరుకుంటాడు కాని ఆ సుఖాలు కల్గించే పుణ్యకర్మలు బలవంతంగానైన చేయడు. "నహికశ్చిత్ క్షణమపి జాతు తిష్ఠ కర్మకృత్" కర్మ చేయకుండా క్షణం కూడా ఉండలేడు.

మాతృగర్భంలో ఉండగా క్రిమి కీటకాదులతో బాదింపబడుతూ ప్రసూతి వేదనలతో అతి కష్టములు అనుభవిస్తు రోదిస్తూ ఈ ప్రపంచంలో జన్మిస్తాడు. బాల్యంలో కార్య కారణ సంబంధము ఉండదు. అందరూ చీదరించుకుంటూ ఉంటారు. బాల్య రోగాలతో బాధలు ఎవరికి చెప్పుకొనే శక్తి లేక అసమర్ధతతో గడుస్తుంది. ఈ బాధలు తలచుకుంటే జుగుప్స కల్గిస్తుంది.

అయినా వివేకములేక యౌవనమురాగానే బుద్ధి వికాశాన్ని కోల్పోయి, తానే శరీరమని అహంకరించి, స్వార్థంతో తన ఆనందం కోసం ఈర్ష్య, మద

మాత్సర్యాలతో, కోర్కెలు పెంచుకొని, అవి నెరవగానే వాటియందు అనురాగాసక్తుడై, కామంచేత వాటిని పొందటానికి ఇంద్రియలోలుడై ప్రయత్నిస్తాడు. అవి పొందుతే సంతోషము చెందుతూ అవి పొందలేక పోతే వాటికి కారణమయిన వారిమీద క్రోధం, ద్వేషం పెంచుకొంటూ మళ్ళీ కొత్త కర్మలు చేస్తుంటాడు. తాను శరీరాన్ని అని అభిమానిస్తాడు కాబట్టి శరీర సంభందీకుల మీదంతా మమకారం, మోహం పెంచుకొని అనేకమైన కర్మలు చేస్తాడు. ఇంద్రియాలకు, మనస్సుకు బానిసవుతాడు. బుద్ధి దోష పూరితమయి వక్రిస్తుంది. స్త్రీ లోలుడవుతాడు. శరీరం పైకి అందంగా కనిపించినప్పటికి, శరీరం అంతా మాంసమయమని, ఎముకల మయమని వివేకజ్ఞానం కోల్పోయి సంచరిస్తాడు. ఈ విధంగా అజ్ఞాన కారణంగా, ఇంద్రియ చాపల్యం వల్ల యౌవనమంతా గడచిపోతుంది.

ఆ తరువాత వార్ధక్యము వస్తుంది. శరీరము, కాళ్ళు చేతులు వణుకుతాయి. శక్తి హీనుడవుతాడు. ఇంద్రియాలపటుత్వం తగ్గినా, ఆశ, తృష్ణ చావక, మనస్సు విషయాపేచ్ఛ పెరగటానికి వాటిని భోగించటానికి సంకల్పాలు వృద్ధి చేసుకున్నా శక్తి లేక కుమిలి పోతాడు. వానిని చూసి బంధువులు, కొడుకులు, కూతుళ్లు భార్య వినుగు చెందినపుడు అసక్తుడై అట్టి అవమానాలను భరించవలసి వస్తుంది. అవసానదశలో ఎంత ధనవంతు డైనప్పటికి ఎంతమంది మార్బలత్వము ఉన్నప్పటికి, సంఘములో ఎంత పలుకుబడి ఉన్నప్పటికి ఎవరూ సహాయ పడరు. తానే అంతవరకు మమకారముతో ఈ శరీరము పెంచుకున్నప్పటికి, ఈ దేహమునుండి విడివడి పోవటానికి అనేక విధములైన మరణ బాధలను అనుభవించవలసి వస్తుంది. కనీసం ఎప్పుడయినా జీవితంలో దైవ ప్రార్థన చేశాడు అంటే అది కేవలం నిమిత్త మాత్రమే. చేసిన పూజలు కూడా నామ మాత్రమే. మనస్సు లగ్నం చెయ్యడు. భగవంతునికి కొబ్బరి కాయ కొట్టాలనుకుంటాడనుకోండి, తన కోర్కె ఫలించినందులకు. అప్పుడు కూడా కొనే కొబ్బరి కాయ పచ్చడికి పనికి వచ్చే ముదురు కాయ అవునా లేదా అనే స్వార్థానికి ఊహిస్తాడు. కాని భగవంతునిపై ప్రేమచే మాత్రం కాదు. ఎప్పుడయినా సత్యనారాయణ వ్రతము వగైరా చేసుకుంటాడు అనుకోండి. అక్కడ మంత్రాలు చెప్పుతున్న భగవంతుని నామాల మీద ధ్యాస పెట్టక అప్పుడే వచ్చిన మిత్రులను, బంధువులను పరామర్శించటానికి వారిని మర్యాద చేయటానికి ధ్యాసపెట్టుకుంటాడు. కాని మనస్సు భగవంతునిపై లగ్నం చెయ్యడు.

పురోహితుడు కూడా ఓంకారము నామము స్వచ్ఛంగా పలుకడు. మంత్రాలు అపస్వరాలుగా ఉంటాయి. అనుకున్నట్లు తొందరగా పూర్తి చేయించుకొని అప్పుడు వచ్చిన బహుమతులన్ని బేరీజు వేసుకుంటాడు. అంటే కేవలం బహుమతులు పొందటానికి మాత్రమే శ్రీ సత్యనారాయణ స్వామి వారి వ్రతము చేసుకుంటాడు. ఈ విధంగా ఉంటుంది పూజా పునస్కారాలు కూడా. అటువంటి వాడు మరణ సమయంలో దైవనామం ఉచ్చరించటానికి ఎలాశక్తి, జ్ఞాపకం వస్తుంది, జీవిత పర్యంతం విషయ చింతలతో మునిగిన వానికి. అందుచేత ఆవిధంగా మరణ బాధ అనుభవిస్తూ శరీరం వదిలి కర్మ ఫలితాలను, వాసనలను కూడా తీసుకుపోతాడు. అవి అనుభవించటానికి మరల జన్మిస్తాడు. మళ్ళీ మానవ జన్మ వస్తుంది అని నమ్మకం లేదు. అది అతని చేతుల్లో లేదు. కర్మ ఫలితాలను బట్టి క్రిమి, కీటక, జంతు, వృక్ష, మానవ మొదలగు 84 లక్షల జీవరాసులలో ఏదో ఒక శరీరంలో ప్రవేశిస్తాడు. తనమతే తనగతి అవుతుంది. ఏ శరీరం ధరిస్తాడో ఆశరీరాన్ని అభిమానిస్తాడు. దానికి అనుగుణంగా ఆ శరీరం ధర్మాన్ని బట్టి ప్రారబ్ధాన్ని అనుభవిస్తాడు, కొత్త కర్మలు చేస్తాడు. ఇటువంటి కర్మ జన్మమరణ బంధాలలో చిక్కుకుంటున్నాడు. దీనికి అంతులేదు.

కర్మ ఫలితాలన్ని మూడు రకాలుగా నిల్వ ఉంటాయి. (1) సంచితము (2) ప్రారబ్ధము (3) ఆగామి అని. సంచితమంటె ఈ జన్మ వరకు నిలువ ఉన్న ఫలితముల సముదాయము. మనకు అనుభవములోనికి వచ్చేవి. అంటే ఒక బ్యాంకు ఎక్కౌంటులో నిల్వ ఉంచుకున్నట్లే. అందులో కొన్ని కర్మల ఫలితాలను అనుభవించటానికి ఒక శరీరములో ప్రవేశించి జన్మిస్తాడు. అవి దైవాధీనములు. అతను అనుభవించటానికి తీసుకున్న శరీరము ప్రారబ్ధ కర్మ అంటారు. ఈ ప్రారబ్ధ కర్మ అనుభవిస్తేనే కాని తరుగదు. ప్రారబ్ధ మున్నంతవరకూ శరీరము నిలబడి ఉంటుంది. అటువంటి వాణ్ని సముద్రంలో పారేసినా ఈదుకొని వస్తాడు, ప్రారబ్ధము ఇంకా శేషించి ఉంది కాబట్టి. ప్రారబ్ధ కర్మము అనుభవించటము పూర్తి కాగానే, అంటే నిశ్శేషమవుతోనే శరీరము వదలుతాడు. ఎంతమంది గొప్ప వైద్యులు వైద్యం చేస్తున్నప్పటికికూడా. ఇది నియతి. తప్పించటానికి ఎవరకీ శక్యము కాదు. ప్రారబ్ధము అనుభవించే తీరాలి. అది విడిచి పెట్టిన బాణం లాంటిది. ఈ జీవితంలో ప్రారబ్ధ కర్మ అనుభవిస్తూ చేసిన కర్మ ఫలితాలను ఆగామి అంటారు. అది మళ్ళీ సంచితంలో ఉన్న నిలువను వృద్ధి చేస్తాయి. ఇది కర్మ ఫలితాల యొక్క నిబంధన, జన్మ మరణాలకు కారణం.

# మానవ జన్మ ప్రాముఖ్యత

ముఖ్యంగా గమనించవలసిన విషయమేమంటే అన్ని జన్మలలోనూ మానవ జన్మ ఉత్కృష్టమయినది. దేవతలుకూడా మోక్షప్రాప్తికి మానవ జన్మే కోరు కుంటారు, వారి పుణ్య కర్మల ఫలితాలను అనుభవము పూర్తవగానే. మిగిలిన పశు పక్ష్యాదులకు ప్రారబ్ద కర్మలను అనుభవించటానికే జన్మిస్తాయి. కాని కొత్త కర్మల ఫలితాలు వాటికుండవు. ఎందుచేతనంటే యుక్తాయుక్త విచక్షణ జ్ఞానం కలుగ చేసే బుద్ధి వాటికి ఉండదు. అందుచేతనే ఒక ఆవు ఉందనుకోండి. అది పరుల పైరుల పైబడి మేస్తుంది. దానికి ఇది పరుల పైరు, వారి పైరును మేసి వారికి నష్టం కలుగ చేయకూడదనే విచక్షణా జ్ఞానం వాటికి భగవంతుడివ్వలేదు కాబట్టి. ఆ కర్మ ఫలితము దాని కుండదు. కాని ఆ పొలము యజమాని పైరు నష్టము కలుగ చేస్తుందనే నెపంతో, లోభంతో, క్రతో దాన్ని కొట్టి దాన్ని కుంటిదాన్ని చేస్తాడు. ఆ కర్మ ఫలితం అతనికి అంటు కుంటుంది. ఎందుచేతనంటె పైరుకు కంచె వేసుకొని రక్షించుకోకపోవటం. పొరపాటు అతని తప్పు. ఆవు మేస్తోంటే దానికి విచక్షణా జ్ఞానం లేక అలా చేస్తోంది. అది దాని లక్షణము అని తన బుద్ధి చేత విచారించి మామూలుగా అదలించి ఉండవలసింది. కాని లోభత్వంతో క్రతో దాన్ని తీవ్రంగా కొట్టి దానికి బాగా బాధ కలిగేటట్లుగా కాలు విరుగకొట్టాడు. అందుచే ఇంకొక ప్రాణికి హాని కల్గించిన ఫలితం అనుభవించక తప్పదు. ఈ కర్మ ఫలితం ఇంకా ఎలాగుంటుంది అంటే ఉదాహరణకు మీ ఇంటికి వచ్చాను. ముందుగదిలో ఎవరూ లేరు. అక్కడ బల్లమీదమంచి ఖరీదయిన చేతి గడియారము ఉంది. ఇంటి యజమానురాలు కూర్చోమని లోపలకు వెళ్లింది. పూర్వ జన్మ వాసనలవల్ల బల్లమీద ఉన్న చేతి గడియారాన్ని దొంగిలిద్దామని సంకల్పము కలిగింది. అటువంటి చెడు పనిని సంకల్పం చేయుటకూడ పాపమే. దానికి కూడ కర్మ ఫలితముంటుంది. అంటే మానసికంగా అప్పుడే దొంగనయ్యాను. కాని ఆత్మ చెబుతూనే ఉంటుంది. దొంగిలించడం పాపమని. అయినప్పటికి బుద్ధి పూర్వ జన్మ సంస్కారాన్ని బట్టి ఖరవాలేదు. దీన్ని దొంగిలిస్తే అప్పుడే ఇటు వెళ్లిన పనిమనిషి మీదకు పోతుంది. నా మీదకు రాదు. ఎందుచేతంటే నేను సంఘములో పలుకుబడి ఉన్న సంపన్న గృహస్తుణ్ని అని. అందుచేత దొంగిలించటం అనే కర్మను నిశ్చయిస్తుంది. అంటే మనస్సును

జ్ఞానేంద్రియాలతో ఏకీభవిస్తుంది. వెంటనే అహంకారంతో కర్మేంద్రియాలతో దొంగిలించటం అనే పని పూర్తి అవుతుంది. అపుడు శరీరకంగా దొంగను అయాను. దాని ఫలితం తప్పదు. ఇది కర్మ సిద్ధాంతము.

అయితే ముఖ్యంగా గమనించ వలసిన విషయమేమిటంటే బహు జన్మలలో చేకూరిన పుణ్యాన్ని వెచ్చించి ఈ మానవ జన్మను పొందాము. పూర్వ జన్మలలో పుణ్య ఫలము ఉంటేనే కాని మానవ జన్మ దుర్లభము. ఈ మానవ జన్మలో యుక్తా యుక్త విచక్షణా జ్ఞానం కలుగ చేసే బుద్ధిని భగవంతుడు మనకి ప్రసాదించాడు. ఒక్క మానవుడికి మాత్రమే ప్రారబ్ధ కర్మని అనుభవిస్తూ, జ్ఞాన సముపార్జన చేసుకొని, సంచితకర్మ సముదాయాన్ని భస్మం చేసుకొని, ఆగామి కర్మ ఫలితాలనుండి తప్పించుకునే కర్మ కౌశలము ప్రదర్శిస్తూ కర్మ బంధాల నుండి తప్పించు కోవటానికి సాధ్యమవుతుంది. ఇది తీవ్ర ముముక్షుత్వము, సద్గురువు ఆత్మ బోధవల్ల, తద్వార తీవ్ర సాధన ద్వారా నిర్వికల్ప సమాధి పొందుతేనే గాని మోక్షము కలుగదు. ఆ విధంగా శ్రేయో మార్గంలో పయనించకుండా ప్రేయో మార్గంలో ప్రవర్తించి, ప్రవృత్తితో నిషిద్ధ కర్మలాచరించి అజ్ఞానంవలన మానవ జన్మను వ్యర్థము చేసుకొని జన్మ పరంపరలో చిక్కుకొని పతనమవుతున్నాడు.

స్వయంగా తాను ఆనంద స్వరూపుడయినప్పటికి ఆనందం బాహ్య వస్తువులలో ఉంటుందనే భ్రమతో ఇంద్రియాలను బాహ్య ప్రవృత్తి చేసుకొని తనకు ఇష్టమయిన వస్తువును చూసినపుడు తనలోని ఆనందసాగరం నుండి కొంచెం పైకి ఉబికినపుడు వస్తువు నుండి ఆ ఆనందము వస్తున్నదని భ్రమిస్తాడు అజ్ఞానం చేత. ఒకరికి కారీర కాయ యందు ఇష్టంచేత అతనికి ఆనందం కలుగుతుంది. నిజంగా ఆ వస్తువులో ఆనందం ఉంటే అందరికి ఆనందం కలగాలి కదా! కాని అలా జరగటం లేదు. కాబట్టి ఆనందం తనలోనే ఉంది, తాను స్వతహాగా ఆనంద స్వరూపుడు కాబట్టి.

## శుభేచ్ఛ

ఇలా జన్మ పరంపరలలో చిక్కుకుంటూ విసిగిపోయి పూర్వజన్మల పుణ్య పరిపాకమువలన కించిత్ వైరాగ్యముదయించి ఏ విధంగా జన్మ పరంపరలలో నుండి తప్పించుకొని మోక్ష సిద్ధికి ప్రయత్నం చేయాలి అని

సజ్జన సాంగత్యము చేస్తూ సద్గురువుకై అన్వేషిస్తాడు. అంటే అతనిలో శుభేచ్ఛ మొదలయింది. సత్సాంగత్యం ద్వారా సత్ గ్రంథ పఠనము ద్వారా తత్ పదార్థము శ్రవణము చేస్తాడు. తాను అజ్ఞానం వలన ఇంద్రియాలకు మనస్సుకు లోబడి మాయవలన ఈ కర్మ బంధంలో చిక్కుకున్నాడని తెలుసుకుంటాడు. మాయ, అవిద్య, అజ్ఞానం ఒకటే. అదే భ్రమ. నిజంగా తాను కాని శరీరాన్ని తాను అనుకొని ప్రవర్తించటమే మాయ. సత్యత్వం లేని దానియందు సత్యమని అసత్యవస్తువుని నిత్యమని భ్రమించటం మాయ అని తెలుసుకుంటాడు. తన పతనానికి సంకల్పాలు, కోర్కెలు, కామము, అనురాగము, మోహము, దంభము, మద మాత్సర్యములే కారణమని గ్రహించి ఎల్లప్పుడు సత్త్వ గుణాభివృద్ధి చేసుకుంటూ సంకల్ప త్యాగం చేసుకుంటూ ఉంటాడు. అయితే మోక్ష సాధనకు ఏ మార్గంలో పయనించాలో కర్మ బంధాలు ఎలా నిర్మూలించుకోవాలో తెలియక వైరాగ్యము పెంచుకుంటూ ఆ వృత్తిలో సద్గురువు కోసం అన్వేషిస్తాడు. ఈ శుభేచ్ఛ ఎంతో పూర్వ జన్మ పుణ్య పరిపాకం వలన గాని కలుగదు.

భగవత్ కృపవలన ఆయన సద్గురు రూపేణ లభిస్తాడు. అపుడు వారికి సాష్టాంగ నమస్కారము చేసి, వినయముతో భక్తి ప్రవృత్తులలో, సంశయ నిర్మూలనకై మోక్ష ప్రాప్తికై గురువును, దేవా! నా పుణ్య పరిపాకము వలన భగవంతుని దయవలన తమ దర్శన మయినది. నేను అజ్ఞానంలో కొట్టు మిట్టాడుతున్నాను. జన్మ పరంపరలలో చిక్కుకున్నాను. నేను తరించి మోక్షము ఏ విధంగా పొందాలి. భగవత్స్వరూపము ఏ విధంగా ఉంది? నేనెవరు? ఈ కనిపించే దృశ్య జగత్తును ఎవరు సృష్టించారు? అని అడుగుతాడు.

## సద్గురు దర్శనము - గురుబోధ

అపుడు శ్రీ గురుదేవుడు అపార ప్రేమతో, వాత్సల్యంతో, అతని సాధన చతుష్టయ సంపత్తిని పెంచుకొని తీవ్ర మోక్షేచ్ఛ కలిగి ఉన్నాడని గ్రహించికొని ఈ క్రింది విధంగా అతని అవిద్య రూపుమాపటానికి, సంశయ నివృత్తి కలగటానికి, స్వస్వరూపజ్ఞానం కలుగుటకై బోధ చేస్తాడు.

ఈ దృశ్య జగత్తు అంతా మనోసృష్టి మాత్రమే. సుషిప్తి (గాఢ నిదుర) లో మనస్సు లేదు అపుడు జగత్తు లేదు. జాగ్రదవస్థలోకి రాగానే మనస్సు విజృంభించి ఈ జగత్తును సృష్టిస్తోంది. నామ రూప రహితుడైన నిర్గుణ

బ్రహ్మమందు మనం అజ్ఞానం వలన భ్రమ వలన ఈ లేని జగత్తును ఉన్నట్లుగా భ్రమిస్తున్నాము. అదే సత్యము అనుకుంటున్నాము. "బ్రహ్మ సత్యం జగన్మిథ్యా" అని శ్రీ జగద్గురువు శంకరాచార్యుల వారు బోధించారు. అంటే సినిమా తెరపై బొమ్మలు శాశ్వతం కాదు. ఆ బొమ్మలకు తెర ఆధారము. బొమ్మలను చూస్తున్నంత కాలం తెర కనిపించదు. అదే విధంగా సర్వత్రా వ్యాపించి ఉన్న పరబ్రహ్మమందు సత్యత్త్వ లేని జగత్తు ఆరోపింప బడింది. ఇది మనోవిలాసము. మనస్సు, ఇంద్రియాలు, బాహ్యప్రవృత్తి చెంది విషయ వాంఛలకు లోనవుతాయి. దృశ్యము కనిపించినపుడే రెండవవాడు ఉన్నాడనే విశ్వాసము కలుగుతుంది అజ్ఞానం చేత. దాని వల్ల బుద్ధి నిర్ధారణ చేస్తుంది. అభిప్రాయ మేర్పరుచుకుంటుంది. అవే వాసనలు. ఆ వాసనలు జన్మకు కారణమవుతాయి. అభిప్రాయము కలిగినపుడే దోష దర్శనం చేసి ఆత్మగానే నిర్ధారణ చేసుకోవాలి. బాహ్య జగత్తులోని విషయాల యందు అభిప్రాయాలకు విలువ నివ్వకూడదు. ఉన్నది ఒక్కటే పరమాత్మ. ఎల్లెడలా వ్యాపించి ఉన్నాడు. "ఏకమే వాద్వితీయం బ్రహ్మ నేహ నానాऽస్తి కించన" అజ్ఞానం వల్ల అవిద్యవలన జగత్తుకు ఆధారభూతమైన పరబ్రహ్మను చూసే శక్తి లేక దానిమీద నీ మనో సృష్టియైన త్రిగుణాలతో నిండి ఉన్న జగత్తు సత్యమని భ్రమించి త్రిగుణాలకు లోబడి, వాసనలు పెంచుకొని, తద్వారా చేసిన కర్మల వల్ల జన్మ పరంపరలకు లోనవుతున్నావు. కాబట్టి నీవు చేయవలసినదల్లా నీయందున్న భ్రమను, అజ్ఞానాన్ని, అవిద్యను నిర్మూలించుకోవడమే. ఎప్పుడయితే అవిద్యనశిస్తుందో అప్పుడు జగత్తు మాయ మయి దానికి అధిష్టానమయిన పరబ్రహ్మ గోచరిస్తుంది. అంటే అప్పటివరకు అజ్ఞానం వలన చూసిన జగత్తు ఎక్కడకో పోదు. పరబ్రహ్మలో లయమవుతుంది. ఇది ఎలాగంటే మనకచీకట్లో ఒకడు త్రాడుని చూచి పాము అని భ్రమ చెంది భయకంపితాలకు లోనయ్యాడు. అయితే అక్కడ పాము ఉంది అజ్ఞానికి. ఆ స్థితిలో అది సత్యమే. అది పాము కాదురా త్రాడు మాత్రమే అని ఎవరు చెప్పినా వినిపించుకోడు. ఒక దీపము తీసుకొచ్చి చూపించగా అక్కడ త్రాడు గోచరిస్తుంది. అయితే అప్పటివరకు ఉన్న భ్రమచేత ఊహించుకొని మనస్సు చేత కల్పించబడిన సత్యంగా ప్రకాశమయిన పాము ఏమయింది. దీపము చూపించగానే ఆ పాము త్రాడులో లయమయింది. అంటే పాముకు త్రాడు అధిష్టానము. అదే విధంగా ఈ చూడబడే జగత్తు జ్ఞానం కలుగనంతవరకు అవిద్య మూలంగా పరబ్రహ్మము దానికి అధిష్టానమయినప్పటికి జగత్తుని సత్యత్వంగా భ్రమించి వాసనలు

ములయినవి. అందుచే నేను నిమత్త మాత్రుడను. సంపత్తు, భార్యా, పుత్ర మిత్రాదులు, గృహారామక్షేత్రాదులతో కలుగు సంయోగములన్నీ వియోగము కొరకే. అవి దేహసంబంధములే. ఈ అహంకార రూపమై ఉండు ఈ శరీరము సత్యము కానపుడు మమకార రూప "నాది" అనే ప్రతి ప్రదార్థమందు దోషనిర్ణయము చేసి తీవ్రవైరాగ్యములో ఉంటాడు. ఇది దృఢ పడుతూ రాగా దుష్టుల విడనాడి సజ్జనుల నాశ్రయించి నిరంతరము మనస్సు నందు స్థిర పరచుచూ వస్తు తత్త్వజ్ఞానమందు ఆసక్తి కలవాడై మౌనమును స్వీకరించి సంకల్పరహితుడై నిస్సంకల్ప స్థితిలో ఉండుటకు అవలంబించును. పై విధముగా శుద్ధ సత్వాన్ని ఆశ్రయించుటే మూడవ భూమిక దాటిన వానికి తత్వమసి అను వాక్యార్థ ముపదేశమునకు అర్హుడౌతాడు. నాల్గవ భూమికకు చేరుకుంటాడు ఈ భూమికలో సాధన చతుష్టయ సంపత్తిని పూర్తి పొందికర్తృత్వ రహితుడై అహం మమలను విడనాడి "తత్త్వ మసిమహా వాక్యార్థమును గ్రహించి అహంబ్రహ్మాస్మి" వృత్తిని స్వీకరిస్తాడు. ఈ రీతిగా మనస్సును ఆద్యంత శూన్యము అఖండైకరసము, శాశ్వతము, సర్వోత్కృష్టము, పూర్ణ చంద్రోదయము వలెనుండు పరబ్రహ్మ స్వరూపముగా అనగా "ఇదియే నేను" అనే సమాధి రూప అనుభూతిని గురుశక్తి పాతముద్వారా ఆనంద రూపమును అనుభవము తెచ్చుకుంటాడు. ఈ విధంగా సంసారమూలాజ్ఞానముతో సహా "జ్ఞానాగ్ని సర్వకర్మాణాం భస్మ సాత్కురేర్జున" అనినటుల సంసారము పూర్తిగా విలయమై ఉత్కృష్టమయిన సద్ఘన, చిద్ఘన, ఆనంద ఘనరూప బ్రహ్మేతన స్వరూపముగా అనుభవిస్తాడు. అంటే నిర్వికల్ప సమాధి అనుభవిస్తాడు. ఈ విధంగా తాను అనుభవిస్తున్న స్థితియే నాల్గవ భూమిక అయిన సత్త్వాపత్తి. ఈ భూమికయందున్న వానిని బ్రహ్మవిదుడుగా" పేర్కొన బడుతాడు. అటువంటి యోగి "నచరా పునరావర్తతే" అనినటుల తిరిగి జన్మను పొందడు.

**(5)** అసంపక్తి : ఈ భూమిక చేరిన యోగిని "బ్రహ్మవిద్వరుడు" అంటారు. ఎల్లవేళల అంతర్ముఖుడై సుషుప్తావస్థయందుండు వానివలె ఉంటాడు. మరియు ముముక్షులయిన వారికి ఉపదేశము చేయుచూ శౌచస్నానాదులయందు ప్రవృత్తి కల్గిననూ తాను చేయు కొద్దిపాటి వ్యవహారములున్నూ అహంకారమే చేయుచున్నదని సర్వ ఇంద్రియ వ్యాపారాన్ని వాటి వాటి గోళములకు అంటగట్టి తాను మాత్రం నిత్యము సుఖము జనన మరణ రూప సంసారముగాని బ్రహ్మయే నేనని అఖండాకార

వృత్తినవలంబించి నిత్యమూ బ్రహ్మయందే చరించుచూ ఉంటాడు. ఏకాంత నిష్టుడయి సదా శుద్ధ బ్రహ్మరూప సమాధి యందుండును. ఈ భూమిక యందు చిత్తము బొత్తిగా ఉండదు. తాను సత్తామాత్రముగ ప్రతీతి అగుచుండును. మరియు నిత్యతృప్తుడై, సంక్షోభశూన్యుడై సర్వభేధములు లేక పరబ్రహ్మయందె నిలచిఉండుటచే నిదురించిన వానివలె కానవచ్చును. విషయములందు అనాసక్తుడై ఉండును. ఈ భూమికలో చేరిన మహాత్ముని ఏ విషయములు బంధింపవు. వారిని తత్వదర్శిని అని అనుచున్నారు. ఏకస్వరూపమైన "ఏకమేవాऽద్వితీయం బ్రహ్మ నేహ నానాస్తి కించన" అనినటుల ద్వితీయవస్తు రహిత శుద్ధ చైతన్య ఆనంద రూపాత్మ తాననే నిశ్చయము కలిగి సర్వ పరిత్యాగముచే కర్తృత్వ భోక్తృత్వములు లేక తామరాకు మీద నీటి బిందువు లాగా ఉంటాడు. శరీరాన్ని ప్రారబ్దానికి విడుస్తాడు. "సర్వమిదం అహంబ్రహ్మైవ" అని బ్రహ్మతో ఐక్యమును పొందుతాడు. నామరూపాత్మకమైన జగత్తును కూడా బ్రహ్మగా గాంచుచూ, ఆనందమయుడై ముముక్షు జనులకు ఆత్మతత్త్వము బోధ చేయుచూ బ్రహ్మ విద్వరుడని ఖ్యాతి పొందుతాడు. బాహ్య వ్యాపారమంతయూ గుణకార్యములని నిశ్చయించుకొని సర్వదా ఏకాంతనిష్టుడై ఉంటాడు. ఈ విధంగా అసంసక్తిని అధిరోహించిన నిర్గుణభక్తుడు సర్వ భూతములయందు ద్వేషభావము లేక మైత్రి కలిగి ఉంటాడు.

**(6)** పదార్థ బావన : ఈ భూమికను పొందిన మహాత్ముడు బాహ్యాంభంతర వీచక్షణ లేక పదార్థములన్ని బ్రహ్మ భావన చేస్తాడు. అమనస్కయోగము నాశ్రయించిన వాడై ఆత్మక్రీడ ఆత్మరతి ఆత్మానందమునే నిత్య నిరంతరము అనుభవిస్తూ ఆత్మారాముడని పిలువ బడుతాడు. ఈ స్థితిని పొందినవాడు తన నిజస్వరూపమును సాక్షాత్కరించుకొని తురీయ స్థితిని పొందినవాడై జీవన్ముక్తుడై మెలుగుచుండును. అట్టి జ్ఞాని సర్వంఖల్విదం బ్రహ్మ" యని సర్వమును బ్రహ్మ యందన్వయ పరచుకొని ఆనంద సాగరముల నోలలాడుతూ ఉంటాడు. ఈ ఆరవ భూమికను చేరిన యోగిని నిదురించి నిదురింపని వానివలె వ్యవహారములు చేయు చుండియూ చేయని వానివలె ఉంటాడు. కేవలం పరమానంద నిమగ్నుడై ఉంటాడు.

**(7)** తుర్యగ : ఆరవ భూమికను చిరకాలము అభ్యసించుటవలన బ్రహ్మ వేత్తలలో అగ్రగణ్యమైన అనగా సిద్ధులలో (బ్రహ్మవేత్తలలో) ఉత్తమోత్తమైన తుర్యగ అనుభూమికను పొందును. నిర్మలత్వము, పరమశాంతత్వమే ఈ

భూమిక యొక్క ముఖ్యలక్షణము. ఈ భూమికలో పరిపూర్ణుడై పూర్ణసుధాకరుని పోలిన నిత్యతృప్తితో, సుఖదుఃఖముల స్మరణలేక ఆత్మారాముడై తననాశ్రయించిన వారికి అంతఃకరణ సీతలమును కలుగచేయుచూ పరమాత్మతానై మౌన స్థితిలో నిత్యనిరంతరము బ్రహ్మభావనమనే నిర్వికల్ప సమాధిని ఆశ్రయించి ఉంటాడు. ఈ సప్త భూమికనే "బ్రహ్మ విద్వరిష్టస్థానమని చెప్పుదురు. వీరు బాహ్యము సర్వము మిధ్యఅనే నిశ్చయము ద్వారాసకల సంశయరహితుడై, సర్వదా నిధి ధ్యాసనాపరుడై నిర్వికల్ప సమాధి నిష్టుడై బాహ్యాంభ్యంతర సర్వ వ్యాపారములను మరచి స్వస్వరూపానందమునందే చిత్తము గలవాడై సంసారసాగరమును తరించినవాడగుతున్నాడు. ఈ స్థితికే శివుడని, రుద్రుడని, బ్రహ్మయని అంటారు. ఈ భూమికను చేరినవారికి మౌనమే ప్రధానంగా ఉంటుంది. వీరు ప్రపంచములోని సర్వత్రిపుటిలను సమన్వయపరచుకొని నిర్గుణ, నిర్వికార, పరబ్రహ్మ స్థితిలో ఉండుటయే ఈ భూమిక యొక్క పరిపక్వస్థితి. పిపీలికాది బ్రహ్మ పర్యంతముగల సమస్త జీవకోటి తాను ఎటువంటి ఆనందస్వరూపుడో అటవంటి ఆనంద రూపులనే భావంతో ఉంటాడు. సర్వధర్మములు విడిచి ప్రణవ స్వరూపుడైన బ్రహ్మమే తానై ఆనందఘన స్వరూపముక్తిని పొందును.

## నిర్వికల్ప సమాధి పొందిన యోగి ఏ విధంగా సాధన కొనసాగించాలి

లోగడ పేర్కొన బడిన విధంగా శ్రీ గురువుదేవుల మహా వాక్యోప దేశము పొంది వారి శక్తి పాతముతో నిర్వికల్ప సమాధి పొందిన ముముక్షువు నకు కర్మ బంధాలన్నీ విడిపోతాయి. చిత్ గ్రంధి విచ్ఛిన్నమవుతుంది. ఒక దూదితో నింపిఉన్న గదిలో ఒక అగ్నికణము పడితే ఏ విధంగా దూది అంతా భస్మము అవుతుందో ఆ విధంగా సంచితకర్మ సముదాయమంతా భస్మమవుతుంది. అయితే ఈ స్థితి ఒకసారి పొందిన తర్వాత నిత్యనిరంతరము సాధన చేస్తూ నిలబెట్టుకోవాలి. ఇక్కడకు చేరిన తరువాత మాయకులోను కాకూడదు. జగత్తులోని విషయాల వలన ఇంద్రియాల బలం జారిపోయే అవకాశముంటుంది. అదేవిధంగా ఒకలేడిమీద వాత్సల్యముతో మోహాంతో భరతునకు పునర్జన్మ తప్పలేదు. కొంతమందికి శ్రీగురుదేవుని శక్తి పాతముచే నిర్వికల్ప సమాధి పొందిన కొంతకాలమునకే నేను "పరబ్రహ్మను" నాకంటె

అన్యమేది లేదు అని దురహంకారంతో మాయవలన పతితుడగుటకు అవకాశము కలదు.

కాబట్టి నిత్య నిరంతరం జగత్తు కూడ పరబ్రహ్మకంటే వేరుకాదు, అని తాను ఎక్కడెక్కడ చూస్తాడో అక్కడక్కడల్లా సహజ సమాధి స్థితి పొందే వరకు కడు జాగ్రత్తగా తన సంకల్పాలపై విచారణ చేసుకుంటూ మనస్సు సాధనలో పెట్టి తురీయ భూమికకు చేరునంతవరకు తీవ్ర ప్రయత్నము తప్పదు. ఆ విధంగా తీవ్ర సాధన చేయుముముక్షువునకు తన స్వస్వరూప అనుభవము నిర్వికల్ప సమాధి ద్వారా కలుగబట్టి సంచిత కర్మ భస్మమవుతుంది. ఇక ప్రారబ్దము విడిచి పెట్టిన బాణము కాబట్టి దానిని అనుభవించటాన్ని శరీరానికి అప్ప చెబుతాడు. తాను సాక్షిచైతన్యాన్ని అని అనుభవంలోకి తెచ్చుకున్నాడు కాబట్టి, శరీరము తాను కాదు అని నిశ్చయాత్మక బుద్ధికలవాడగుటచే ప్రారబ్ధకర్మ ప్రకారం శరీరానికి వచ్చిన కష్టసుఖాలను కూడా దానికి అప్పచెప్పి ఉదాశీనంగా ఉంటాడు. వాటిలో తగుల్కొని విక్షేపాలు రానీయడు. తాను మహావాక్య అనుభవంలోకి తెచ్చుకున్నాడు కాబట్టి శ్రీ గురువు గారి తత్త్వబోధ వల్ల కనిపించే జగత్తు అంతా బ్రహ్మ పదార్థమని నిది ధ్యానతో తత్త్వమసి అను మహావాక్యం అనుభవంలోకి తెచ్చుకుంటాడు. తాను చూసిన చోటెల్లా బ్రహ్మ పదార్థమే గోచరిస్తుంది. జగత్తు కన్పించదు. జగత్తు బ్రహ్మకంటె వేరుకాదు, అని అనుభవంలోకి తెచ్చుకుంటాడు. ఆ విధంగా తాను సహజసమాధి స్థితికి చేరుకుంటాడు.

తనలోని కన్ను ద్వారా చూసిన జ్ఞానం చెవి మొదలగు ఇంద్రియాల ద్వారా తెలిసికొన్న జ్ఞానం అన్నిటికి మూలాధారమైన ప్రజ్ఞానం అనేది ఏదయితే ఉన్నదో అది ఎరుక అనిన్నీ ఇవన్ని తనలోనే తానై ఉన్నాడని నిర్ధారణ చేసుకొని "ప్రజ్ఞానం బ్రహ్మ" అని అనుభవంలోకి తెచ్చుకుంటాడు.

ప్రతి జీవరాశిలోనూ ఉన్న చైతన్య శక్తి కూడా ఆ పరమాత్మేనని అఖితనకంటె వేరు కాదని తాను అందరిలో ఉన్నానని అవితనలో ఉన్నవని నామరూపాలకు ప్రాధాన్యత ఇవ్వకుండా, ఆ పరబ్రహ్మ సర్వేసర్వత్రా నిండి ఉన్నట్లుగా తీవ్ర సాధన వల్ల "అ యామాత్మా బ్రహ్మ" అను మహావాక్యము అనుభవంలోకి తెచ్చుకుంటాడు. ఇది సమాధి అని ఇది సంసారమని ప్రత్యేకత పోయి సహజంగా నిర్వికల్పంలోనే ఉంటాడు. ఎందుచేతంటే భ్రాంతి వల్ల బుద్ధిచే తెచ్చుకున్న మానసిక సంసారం విడిబడుతుంది. ఇక సంసారధ్యాస

ఉండదు. పాలలో నుండి వచ్చిన వెన్నను కాయగా నెయ్యి అవుతుంది. అది మళ్లీ పాలలో కలవదు. అదే విధంగా తాను నిర్వికల్ప సమాధి ఆ తరువాత సాధనాబలంతో సహజ సమాధి స్థితిని పొందిన యోగి పూర్ణుడవటం మూలంగా సంసారంలో కలవడు. తీవ్ర సాధన వలన రెండవ వాడులేడు. ఏకమే వాऽద్వితీయం బ్రహ్మ, ఉన్నది ఒక్కడే అదితాననే నిత్యనిరంతరం అనుభవంతో ఉండటంవలన పూర్ణుడవుతాడు. అయితే చంద్రుడు చంద్రునియొక్క వెన్నెలకు భేదంలేదు. చంద్రుడు సత్తు, వెన్నెలచిత్తు. సత్తులేకుండా చిత్తులేదు. ఆ రెండూ అభేదము. తాను పూర్ణ స్థితిలో ఉన్నప్పటికి ఇంకనూ శరీరము ఉంది కాబట్టి, దానికున్నవి హిత కర్మలాచరించాలి కాబట్టి, తనను ఆశ్రయించిన ముముక్షువులు తరించుటకై తత్త్వబోధచేయాలి కాబట్టి పూర్ణుడైనప్పటికి శుక్ల చతుర్దశి చంద్రుడివలె వ్యవహరిస్తాడు. ఇక అతను చేయవలసిన కర్మలేవీ ఉండవు. శారీరధర్మాన్ని బట్టి ఏమి కర్మలు చేసినా చేయనట్లె లెక్క. అందుచే ఆగామి కర్మ ఫలితాలు అతనికి ఉండవు. కర్మ ఫలమంతా నిశ్శేషమవుతుంది. తనవద్దకు వచ్చిన వారిపై జ్ఞానదృష్టి ప్రసరించడంవలన ఆ వచ్చిన వార్కి శీతలము శాంతము చిక్కుతాయి. అటువంటి మహాయోగియొక్క కృపావీక్షణాలచే వారి పాపసముదాయముకూడా పటాపంచలవుతాయి. వారుద్ధరింపబడుతారు. అటువంటి యోగి ఎల్లప్పుడు నిశ్చల సమాధిలో ఆనంద సముద్రంలో ఈదుతూ ఉంటాడు. లోక వ్యావాహారర్థం బలవంతంగా బయటికి వస్తాడు. ఒక్కొక్కసారి తానులోనేతాను మాట్లాడుకుంటాడు. నవ్వుకుంటాడు. శరీరము మీద ఈగలు మొదలైనవి వాలినా శరీరస్పృహ ఉండదు కొందరికి వారి సాధనానుసారంగా. ఘనసత్కారాలు జరిగినా ఉప్పొంగరు. అవమానాలు జరిగినా కృంగిపోరు అతినిర్మలహృదయుడై, సహనపరుడై ఉంటాడు. అతనివద్ద బద్ధవైరజంతువులుకూడా మైత్రితో మెలగుతాయి. తీవ్ర సాధన వల్ల కొన్ని సిద్దులు పొందినప్పటికి అవి ఎన్నటికి ప్రదర్శించడు. ఈ స్థితిలో సప్త భూమికలలో విశద పరచినటుల ఒక భూమికను దాటిమరో భూమికి చేరుకుంటాడు.

నేను అద్వితీయుడను, నాశరహితుడను, విశ్వరూపుడను, మంగళాకరుడను, శాశ్వతుడను, అనంతుడను, అచ్యుతుడను, అవినాశిని, నిత్యుడను, ముక్తుడను, పరిశుద్ధుడను, నిర్వికారుడను, నిర్గుణుడను, స్వయం ప్రకాశకుడను, నిరాకారుడను, జ్ఞాన స్వరూపుడను, తత్త్వస్వరూపుడను, అచలుడను, అమృత స్వరూపుడను, అవాఙ్మానస గోచరుడను, అభిన్నుడను

అని ఎల్లవేళల అనుసంధానము చేసుకొనుచు ఆనందసాగరములో వోలలాడుతాడు ఆత్మారాముడై వెలయును.

అటువంటి అవధూత ఆశా పాశములులేనివాడై, పరిశుద్ధుడై, అంతటను సమభావముతో మునిగిన వాడై విదేహకైవల్యము పొందుచున్నాడు. నియతి ప్రకారము శరీరము త్యజించగానే ఆ అవధూత పునర్జన్మ కలుగచేయు బీజాలు, వాసనలు అన్నీ దగ్ధమయ్యాయి కాబట్టి పునర్జన్మలేదు. ఆయన పరమాత్మలో కలసి పోతాడు ఏ విధంగానంటే ఘటాకాశము అనంతాకాశము ఒకటే కదా! ఘటము భంగమవగానే ఘటాకాశము అనంతాకాశములో కలిసిపోతుంది. ఇక అక్కడ ఆవరణ లేదు. దీనినే పునర్జన్మ లేని మోక్షము అంటారు.

ఎన్నో పూర్వ జన్మలలో చేసిన పుణ్యమును వెచ్చించి మానవ శరీరము తీసుకొని సాధించవలసిన గమ్యము ఇదియే. అలా చేయక పోతే జన్మపరంపరలలో చిక్కుకొని పతనమవుతాడు.

ఓం తత్సత్

ఒకటవ అనుబంధము

# గురుపూజ

గురు ధ్యానము

ఓం శ్రీ సద్గురవే నమః

శ్లో. సంసార వృక్ష మారుఢాః పతన్తో నరకార్ణవే।
యేన చైవోద్ధృతా స్సర్వే తస్మై శ్రీ గురవే నమః ॥

శ్లో. అనేక జన్మ సంప్రాప్త సర్వకర్మ విదాహినే।
స్వాత్మజ్ఞాన ప్రదానేన తస్మై శ్రీ గురవే నమః ॥

శ్లో. జ్ఞానం విజ్ఞాన సహితం లభ్యతే గురుభక్తితః ।
గురోః పరతరం నాస్తి జ్ఞేయోఽసౌ గురుమార్గిభిః ॥

# అశరీర సంకల్పము

శ్లో. (ఓం) గురుబ్రహ్మా గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః ।
గురు స్సాక్షాత్ పరబ్రహ్మ తస్మై శ్రీ గురవే నమః॥

ఓం అశరీర గురుసాంప్రదాయ విధానం అహం కరిష్యే! శ్రీ మదఖండ సచ్చిదానంద సద్గురు సాంప్రదాయ నివాసే! ఆర్యదర్శన స్పర్శకాలే! శ్రీ మదఖండ సచ్చిదానంద సద్గురు చరణారవింద మకరంద పానాంగీకార సమయే! శ్రీగురు పరంపర కటాక్షవీక్షణా సిద్ధ్యర్థం! మమ మోక్షాధికార సిద్ధ్యర్థం! సాలోక్య సారూప్య సాయుజ్య సాక్షిత్వ సాన్నిధ్యకాలే! అద్వైతగురుపాదసన్నిధౌ! ఆనందపుర నివాసాయాం! ముక్తికాంతా సంయోగక్షేత్రే! సహస్రారామృతానంద తీరే! బ్రహ్మనాళయోర్మధ్యే! పరబ్రహ్మావతారే! తూరీయాయణే! అవ్యక్త ఋతుః! అజ్ఞాన శూన్యమాసే! ఆత్మపక్షే! శూన్యనక్షత్రే! కళావాసరే! శ్రీ సద్గురు స్వామి రామనాథ నామధేయస్య శ్రీ పరశివ గురోః! శ్రీ మదఖండ సచ్చిదానంద సద్గురు పూజా విధానేన ! బ్రహ్మసృష్టి మారభ్య ! బాల్య యౌవన కౌమార వార్ధక్యకాలే ! అవిద్యాకాలాకర్మజన్మవాసనానివృత్త్యర్థం అండపిండ బ్రహ్మాండ నివాసే! నాదబిందు కళాతీతే ! ఇడా పింగళా సుషుమ్నే ! గంగా యమునా సరస్వతీ నివాసే ! త్రివేణి స్నానం త్రికూటస్నానం ఆత్మస్నానం! శ్రీ మదఖండ సచ్చిదానంద సద్గురు పాదోదక స్నానం ! అహంకరిష్యే ! అద్వైత పరిపూర్ణ మంత్రోదక స్నానం అహంకరిష్యే ! ఆ చంద్రతారార్క వంశాభివృద్ధే! సాధుభోగ సమత్పుణ్యే ! గురుకటాక్ష ఫలం లభేత్ !

పూర్వోక్త ఏవం గుణవిశేషణ విశిష్టాయాం! శుభతిథౌ మమ జీవబ్రహ్మైక్య సిద్ధ్యర్థం! శ్రీ సద్గురు ప్రసాద సిద్ధ్యర్థం మహావాక్య మంత్ర జపం కరిష్యే

అస్యశ్రీ మహావాక్య మహామంత్రస్య పరబ్రహ్మ పరమాత్మా దేవతా హంబీజం సఃశక్తిః సోహం కీలకం మమ సద్గురు ప్రసాద సిద్ధ్యర్థ జపే వినియోగః

సత్యం జ్ఞానం అనంతం బ్రహ్మ అంగుష్ఠాభ్యాం నమః
నిత్యానందో బ్రహ్మ తర్జనీభ్యాం నమః
నిత్యానందమయం బ్రహ్మ మధ్యమాభ్యాం నమః
యావై భూమా అనామికాభ్యాం నమః
యావై భూమాధిపతిః కనిష్ఠికాభ్యాం నమః
ఏకమేవ అద్వితీయం బ్రహ్మ కరతల కరపృష్ఠాభ్యాం నమః
సత్యం జ్ఞానం అనంతం బ్రహ్మ హృదయమ నమః
నిత్యానందో బ్రహ్మ శిరసే స్వాహా
నిత్యానందమయం బ్రహ్మ శిఖాయై వౌషట్
యావై భూమా కవచాయ హుం
యావై భూమాధిపతిః నేత్రయాయ వౌషట్
ఏకమేవ అద్వితీయం బ్రహ్మ అస్త్రాయఫట్
భూర్భువస్సువరోం ఇతి దిగ్బంధః

శ్లో. బ్రహ్మానందం పరమ సుఖదం కేవలం జ్ఞానమూర్తిం
ద్వంద్వాతీతం గగనసదృశం తత్త్వమస్యాది లక్ష్యం
ఏకం నిత్యం విమలం అచలం సర్వధీ సాక్షీభూతం
భావాతీతం త్రిగుణ రహితం సద్గురుం తం నమామి.

లం ప్రథ్వీతత్వాత్మనే శ్రీ సద్గురవేనమః గంధం సమర్పయామి
హం ఆకాశ తత్వాత్మనే శ్రీసద్గురవేనమః పుష్పం సమర్పయామి
యం వాయు తత్వాత్మనే శ్రీ సద్గురవేనమః ధూపమాఘ్రాపయామి
రం తేజస్తత్వాత్మనే శ్రీ సద్గురవేనమః దీపం దర్శయామి
వం అమృతతత్వాత్మనే శ్రీ సద్గురవేనమః అమృతఫలనైవేద్యం సమర్పయామి
సం సర్వతత్వాత్మనే శ్రీసద్గురవేనమఃసర్వోపచారాణి సమర్పయామి

శ్లో. నిరాకారం నిరాధారం నిస్సంగం నిష్ప్రపంచకమ్ ।
నిరామయం నిరాలంబం తస్మై శ్రీ గురవేనమః ॥

శ్లో. మన్నాథ శ్రీ జగన్నాథ మద్గురో శ్రీ జగద్గురో ।
మమాత్మన్ సర్వభూతాత్మన్ తస్మై శ్రీ గురవేనమః ॥

ఓం అష్టోత్తర శతనామావళి పూజాం కరిష్యే పుష్పాణి సమర్పయామి

ప్రతినామమునకు మొదట "ఓం" అనియు అంతమున "నమః" అనియు చేర్చి నామములు చెప్పవలెను.

1. ఓం అశరీరాయ నమః
2. అజ్ఞాన ధ్వంసకాయ
3. అచింత్యాయ
4. అద్భుతాయ
5. అవ్యాకృతాకాశాయ
6. అవాఙ్మానస గోచరాయ
7. ఆధారాయ
8. ఆనంద స్వరూపాయ
9. ఇంద్రియాతీతాయ
10. ఈషణత్రయాతీతాయ
11. ఏకాత్మనే
12. కామక్రోధ వివర్జితాయ
13. కాలాతీతాయ
14. కాలాయ
15. కార్యకారణ కర్తృత్వాతీయ
16. చరాచర బ్రహ్మాండ స్వరూపాయ
17. చరాచర సృష్ట్యన్తర్భూతాయ
18. చిత్ స్వరూపాయ
19. చిత్కళాయ
20. చిదాకాశాయ
21. చిన్ముద్రాయ
22. చిన్మయ స్వరూపాయ
23. ఛిన్న సంశయాయ
24. ఓం జగద్వ్యాపినే నమః
25. జగద్గురవే
26. జరామరణ వర్జితాయ
27. సజాతీయ విజాతీయ స్వగతభేద రహితాయ
28. జ్ఞాన గమ్యాయ
29. జ్ఞాన నిత్రే
30. జ్ఞానానందైక నిలయాయ
31. తత్త్వమసీత్యాది మహావాక్య లక్ష్యార్థ స్వరూపాయ
32. తత్వాయ
33. త్రిగుణాతీతాయ
34. తురీయాయ
35. తురీయాతీతాయ
36. దివ్యజ్ఞాన నిదర్శనాయ
37. ద్వైతా ద్వైత విశిష్టాయ
38. ధర్మాధర్మ వివర్జితాయ
39. నచాంకురాయ
40. నాదాతీతాయ
41. నాదబిందు కళాతీతాయ
42. నాదస్వరూపాయ
43. నామరూపగుణ వివర్జితాయ
44. నారాయణ స్వరూపాయ
45. నిత్యముక్త స్వరూపాయ
46. నిరంజనాయ

47. నిర్ధ్వంద్వాయ
48. నిరాకారాయ
49. నిరాధారాయ
50. నిర్వికల్పాయ
51. నిర్గుణాయ
52. నిశ్చలాయ
53. నేతి నేతి వాక్యనిర్ణేత్రే
54. పరబ్రహ్మణే
55. పరమ పురుషాయ
56. పరమాత్మనే
57. పరమానంద స్వరూపాయ
58. షడ్భావ వికారరహితాయ
59. పునరావృత్తి రహితాయ
60. పురాణ పురుషోత్తమాయ
61. పూర్ణానందనిలయామ
62. పూర్ణస్వరూపాయ
63. ప్రకాశాత్మనే
64. ప్రజ్ఞాన ఘనస్వరూపాయ
65. ప్రజ్ఞాతీతాయ
66. ప్రణవ నిలయాయ
67. ప్రణవ స్వరూపాయ
68. ప్రబోధాయ
69. ప్రసన్నాత్మనే
70. పంచకోశ విలక్షణాయ
71. జ్ఞానలింగాయ
72. బాహ్యాంతర సంపూర్ణాయ
73. జన్మజరామృత్యు నివారకాయ
74. మానసాతీతాయ
75. మనోరూపాయ
76. మనోవాచ మగోచరాయ
77. మహాతపసే
78. అలింగాయ
79. అపవర్గప్రదాయ
80. లక్ష్యాలక్ష్య విలక్షణాయ
81. లీలామానుష విగ్రహాయ
82. వ్యష్టి సమష్టి స్వరూపాయ
83. కూటస్థాయ
84. గ్రంధిత్రయ విమోక్షణాయ
85. భవాబ్ధితారణాయ
86. అభయప్రదాయ
87. విశ్వరూపాయ
88. విశ్వతైజస ప్రాజ్ఞ స్వరూపాయ
89. వేదస్వరూపాయ
90. వేదవేదాంత లక్షణాయ
91. వేదాంతసారాయ
92. వ్యోమాతీతాయ
93. శివాయ
94. శాశ్వతాయ
95. శాంతస్వరూపాయ
96. శ్రేష్ఠాయ
97. షట్చక్ర సంచారాయ
98. షట్శాస్త్ర విశారదాయ
99. షడ్గుణైశ్వర్య సంవర్ధితాయ
100. సర్వభూత నివాసాయ
101. సదానందాయ
102. నిరంజనాయ
103. సర్వోపాధి వినిర్ముక్తాయ
104. స్వయంప్రభాయ
105. సచ్చిదానంద స్వరూపాయ
106. సర్వసంగ పరిత్యాగాయ
107. సంసారబంధ నిర్మూలాయ
108. సద్గురుమూర్తయే .

ఓం శ్రీ సద్గురవేనమః నానావిధ పరిమళ పత్రపుష్పాణి సమర్పయామి

శ్లో. ఓం వనస్పతి రసైర్దివ్యైః ।
గంధాఢ్యై స్సుమనోహరైః ॥
అఘ్రేయస్సర్వ దేవానాం ।
ధూపోఽయం ప్రతిగృహ్యతామ్ ।
ఓం శ్రీ సద్గురవేనమః ధూపమాఘ్రాపయామి ॥

శ్లో. చిదాకాశే సదాబానం దీపితం చిత్ జడాత్మకం ।
ఆపోజ్యోతి స్వరూపంచ నమామి గురునాయకం ।
ఓం శ్రీ సద్గురవేనమః సాక్షాద్దీపం దర్శయామి ॥

శ్లో. నిత్యతృప్తం నిత్యపూర్ణం నిష్క్రియా ప్రాణసంయుతం ।
సుఖదం సర్వభూతానాం సద్గురుం తం ప్రణమామ్యహం ।
ఓం శ్రీ సద్గురవేనమః నానావిధ పరిపక్వఫలనైవేద్యం సమర్పయామి ॥

శ్లో. ఓం పూగీఫల సమాయుక్తం నాగవల్లీ దళైర్యుతం ।
కర్పూర చూర్ణ సంయుక్తం తాంబూలం ప్రతిగృహ్యతామ్ ।
ఓం శ్రీ సద్గురవేనమః తాంబూలం సమర్పయామి ॥

శ్లో. ఓం మంగళం గురుదేవాయ మహనీయ గుణాత్మనే ।
సర్వలోక శరణ్యాయ సాధురూపాయ మంగళం ॥

శ్లో. ఓం మంగళం కురుక్షేత్ర రణక్షోణి విహారిణే ।
పార్థసారథి రూపాయ గీతాచార్యాయ మంగళం ॥

శ్లో. (ఓం) ఈశాన స్సర్వవిద్యానాం ఈశ్వరస్సర్వభూతానాం ।
బ్రహ్మాధిపతిర్బ్రహ్మణోఽధిపతి ర్బ్రహ్మ శివోమే అస్తు సదాశివోమ్ ॥

శ్లో. (ఓం) అంతర్జ్యోతిర్బహిర్జ్యోతిః ప్రత్యగ్జ్యోతిః పరాత్పరః ।
జ్యోతిర్జ్యోతి స్వయంజ్యోతిః ఆత్మజ్యోతిశ్శివోఽస్మ్యహమ్ ॥

శ్లో. (ఓం) ఆత్మజ్యోతి ర్మనోజ్యోతిః జ్యోతిశ్చక్షుస్సపశ్యతి ।
సబాహ్యాభ్యంతరజ్యోతిః సా జ్యోతి శ్శివముచ్యతే ॥

శ్లో. (ఓం) మంగళం మద్గురుభ్యోఽస్తు సద్గురుభ్యోఽస్తు మంగళం ।
అస్మత్సర్వ గురుభ్యోఽస్తు నిత్యశ్రీర్నిత్య మంగళం ॥

ఓం శ్రీ సద్గురవేనమః నానావిధ పరిమళ పత్రపుష్పాణి సమర్పయామి

శ్లో. ఓం వనస్పతి రసైర్దివ్యైః।
గంధాఢ్యై స్సుమనోహరైః ॥
అఘ్రేయస్సర్వ దేవానాం।
ధూపోఽయం ప్రతిగృహ్యతామ్ ।
ఓం శ్రీ సద్గురవేనమః ధూపమాఘ్రాపయామి ॥

శ్లో. చిదాకాశే సదాబానం దీపితం చిత్ జడాత్మకం ।
ఆపోజ్యోతి స్వరూపంచ నమామి గురునాయకం ।
ఓం శ్రీ సద్గురవేనమః సాక్షాద్దీపం దర్శయామి ॥

శ్లో. నిత్యతృప్తం నిత్యపూర్ణం నిష్క్రియా ప్రాణసంయుతం ।
సుఖదం సర్వభూతానాం సద్గురుం తం ప్రణమామ్యహం ।
ఓం శ్రీ సద్గురవేనమః నానావిధ పరిపక్వఫలనైవేద్యం సమర్పయామి ॥

శ్లో. ఓం పూగీఫల సమాయుక్తం నాగవల్లీ దళైర్యుతం ।
కర్పూర చూర్ణ సంయుక్తం తాంబూలం ప్రతిగృహ్యతామ్ ।
ఓం శ్రీ సద్గురవేనమః తాంబూలం సమర్పయామి ॥

శ్లో. ఓం మంగళం గురుదేవాయ మహనీయ గుణాత్మనే ।
సర్వలోక శరణ్యాయ సాధురూపాయ మంగళం ॥

శ్లో. ఓం మంగళం కురుక్షేత్ర రణక్షోణి విహారిణే ।
పార్థసారథి రూపాయ గీతాచార్యాయ మంగళం ॥

శ్లో. (ఓం) ఈశాన స్సర్వవిద్యానాం ఈశ్వరస్సర్వభూతానాం ।
బ్రహ్మాధిపతిర్బ్రహ్మణోఽధిపతి ర్బ్రహ్మా శివోమే అస్తు సదాశివోమ్ ॥

శ్లో. (ఓం) అంతర్జ్యోతిర్బహిర్జ్యోతిః ప్రత్యగ్జ్యోతిః పరాత్పరః ।
జ్యోతిర్జ్యోతి స్వయంజ్యోతిః ఆత్మజ్యోతిశ్శివోఽస్మ్యహమ్ ॥

శ్లో. (ఓం) ఆత్మజ్యోతి ర్మనోజ్యోతిః జ్యోతిశ్చక్షుస్సపశ్యతి ।
సబాహ్యాభ్యంతరజ్యోతిః సా జ్యోతి శ్శివముచ్యతే ॥

శ్లో. (ఓం) మంగళం మద్గురుభ్యోఽస్తు సద్గురుభ్యోఽస్తు మంగళం ।
అస్మత్సర్వ గురుభ్యోఽస్తు నిత్యశ్రీర్నిత్య మంగళం ॥

నీలతోయద మధ్యస్థా ద్విద్యుల్లేఖేవ భాస్వరా
నీవార శూకవత్తన్వీ పీతాభాస్వత్యణూపమా
తస్యాశ్శిఖాయా మధ్యే పరమాత్మావ్యవస్థితః
సబ్రహ్మా సశివ స్సహరి స్సేంద్ర స్సోఽక్షరః పరమస్స్వరాట్
రాజాధిరాజాయ ప్రసహ్య సాహినే
నమో వయం వైశ్రవణాయ కుర్మహే
సమేకామాన్ కామకామాయమహ్యం
కామేశ్వరో వైశ్రవణోదదాతు
కుబేరాయ వైశ్రవణాయ
మహారాజాయ నమః

ఓం తద్బ్రహ్మ ఓం తద్వాయుః ఓం తదాత్మా ఓం తత్సత్యం
ఓం తత్సర్వం ఓం తత్పురోర్నమః అంతశ్చరతి భూతేషు
గుహాయాం విశ్వమూర్తిషు త్వం యజ్ఞస్త్వం వషట్కారస్త్వ
మింద్రస్త్వగ్ం రుద్రస్త్వం విష్ణుస్త్వం బ్రహ్మాత్వం ప్రజాపతిః
త్వం తదాప అపోజ్యోతీ రసోఽమృతం బ్రహ్మభూర్భువస్సువరోమ్
ఈశాన స్సర్వవిద్యానాం ఈశ్వర స్సర్వభూతానాం
బ్రహ్మాధిపతిః బ్రహ్మణోఽధిపతిః బ్రహ్మశివోమే అస్తు సదాశివోమ్
ఋతుంగ్ సత్యం పరంబ్రహ్మ పురుషం కృష్ణ పింగళం
ఊర్ధ్వ రేతం విరూపాక్షం విశ్వరూపాయ వైనమోనమః
ఓం నారాయణాయ విద్మహే వాసుదేవాయధీమహి తన్నో విష్ణుః
ప్రచోదయాత్
ఓం తత్పురుషాయ విద్మహే మహాదేవాయ ధీమహితన్నోరుద్రః
ప్రచోదయాత్

శ్లో. ఆకాశాత్పతితం తోయం యథా గచ్ఛతి సాగరం
సర్వదేవ నమస్కారః కేశవం ప్రతిగచ్ఛతి

శ్లో. (ఓం) అన్యథా శరణం నాస్తి త్వమేవ శరణం మమ
తస్మాత్కారుణ్య భావేన రక్ష రక్ష గురూత్తమ
ఆత్మప్రదక్షిణ నమస్కారాన్ సమర్పయామి.

శ్లో. (ఓం) మంత్రహీనం క్రియాహీనం భక్తిహీనం గురూత్తమ
యత్పూజితం మయా దేవ పరిపూర్ణం తదస్తుతే

శ్లో. కాయేనవాచా మనసేంద్రియైర్వా
బుద్ధ్యాత్మనా వా ప్రకృతేః స్వభావత్
కరోమి యద్యత్సకలం పరస్మై
నారాయణాయేతి సమర్పయామి
సర్వం శ్రీ సద్గురు దేవతార్పణమస్తు.

## తీర్థ వినియోగము

శ్లో. (ఓం) అకాల మృత్యుహరణం సర్వవ్యాధి నివారణం ।
సమస్తాఘక్షయకరం శ్రీ సద్గురుపాదోదకం ॥పావనం శుభం ॥

శ్లో. అజ్ఞాన మూలహరణం జన్మకర్మనివారణం।
జ్ఞాన వైరాగ్య సిద్ధ్యర్థం గురుపాదోదకం పిబేత్ ॥

శ్లో. సాలగ్రామ శిలావారి పాపహారి విశేషతః ।
ఆజన్మకృత దోషాణాం ప్రాయశ్చిత్తం దినేదినే ॥
అని తీర్థము యివ్వవలెను.

## శాన్తి మంత్రములు

శ్లో. (ఓం) సర్వేఽత్ర సుఖినస్సన్తు సర్వేసన్తు నిరామయాః ।
సర్వే భద్రాణి పశ్యంతు మాకశ్చిద్దుఃఖ మాప్నుయాత్ ॥

శ్లో. (ఓం) సర్వస్తరతు దుర్గాణి సర్వోభద్రాణి పశ్యతు ।
సర్వస్సద్బుద్ధి మాప్నోతు సర్వస్సర్వత్ర నన్దతు ॥

ఓం అసతోమా సద్గమయ
తమసోమా జ్యోతిర్గమయ
మృత్యోర్మా అమృతం గమయ
ఓం శంనో మిత్రః శంవరుణః శంనో భవత్వర్యమా
శంన ఇన్ద్రో బృహస్పతిః శంనో విష్ణు రురుక్రమః
నమో బ్రహ్మణే నమస్తే వాయో
త్వమేవ ప్రత్యక్షం బ్రహ్మాసి
త్వామేవ ప్రత్యక్షం బ్రహ్మ వదిష్యామి
ఋతం వదిష్యామి సత్యం వదిష్యామి

తన్మామవతు తద్వక్తారమవతు
అవతుమాం అవతు వక్తారం ॥
ఓం శాన్తిః శాన్తిః శాన్తిః ॥
ఓం పూర్ణమదః పూర్ణమిదం పూర్ణాత్పూర్ణ ముదచ్యతే
పూర్ణస్య పూర్ణ మాదాయ పూర్ణమేవా వశిష్యతే ॥
ఓం శాన్తిః శాన్తిః శాన్తిః ॥
ఓం సర్వేషాం స్వస్తిర్భవతు
ఓం సర్వేషాం శాన్తిర్భవతు
ఓం సర్వేషాం పూర్ణం భవతు
ఓం శాన్తిః శాన్తిః శాన్తిః ॥
ఓం స్వస్తి ప్రజాభ్యః పరిపాలయంతాం
న్యాయేన మార్గేణ మహీం మహీశాః
గోబ్రహ్మణేభ్యః శుభమస్తు నిత్యం
లోకాస్సమస్తా స్సుఖినో భవన్తు ॥
ఓం శాన్తిః శాన్తిః శాన్తిః ॥

## శ్రీ సద్గురు ప్రార్థన

1. గురువే సర్వస్వము గురుకృపయే శరణము
గురుసేవే ధ్యేయము గురునామమే దివ్యము
సద్గురు ధ్యానము వినాసాటియైన దేమున్నది
సాక్షాత్కారమునొంది తరించుటకు లోకంలో ॥గురువే ॥

2. తనలోని లోకములను తనివిదీర చూడలేక
బయటనున్న యీ భువినే సత్యమని భ్రమజెంది
అహంకారమమకారములకు లోనైన నాకు
అభ్యాస వైరాగ్యమును దృష్టి ప్రసాదించిన ॥గురువే ॥

3. ప్రజ్ఞానం బ్రహ్మమని వేదం ఘోషిస్తుంటే
అజ్ఞానము నెఱిగెడి ఆ ప్రజ్ఞకూడ బ్రహ్మమేయని
తెలిసీ తెలియదని గ్రహించు తెలివి ఒకటేనని ఆ
సాక్షిమాత్ర చిద్రూపుడవీవే నేనని తెలిపిన ॥గురువే ॥

4. దృష్టి దృక్కు దృశ్యములు తనలోనే కలవని
త్రిపుటిరహితుడైన తాను త్రికాలాబాధ్యుడని

సర్వకర్మ స్వరూపము సచ్చిదానందములని
హస్తవిదిత మస్తకమున చిద్వస్తువు దర్శింపచేసిన ||గురువే ||

---

1. విజ్ఞాని అనుభవ మెరుగవే మనసా । పరమసుఖము
ప్రజ్ఞానమె బ్రహ్మమనుచు పరతత్వమె తానే యనుచు
ప్రాజ్ఞతచే సుఖదుఃఖ ప్రాప్తినంటి ననుభవించు ।
జిజ్ఞాసలు లేవెవ్వని యాజ్ఞకు లోబడడాత డఖి
జ్ఞులిసంగతి వీడడు స్వజ్ఞప్తిని మరువడెపుడు ||వి.||

2. వ్యష్టి ప్రత్యగాత్మయు ।సమిష్టియు పరమాత్మయని
అనుష్టించుచు ।బ్రహ్మ విద్వరిష్ఠ మార్గమున చరించు ।
ఇష్టా నిష్టోపాధు ।వేష్టలుడుగ ।
జ్వాలాన్వితమగు దృష్టి దృక్కు దృశ్యములను ||వి.||

3. దూషణకవమానము ।గురుభూషణ కుల్లాసంబును
వేషభాషల జెందడు వీతరాగ భయ క్రోధుడు
ఈషణ త్రయంబంటడు ।అహింసాత్మకుండు
సకల వేషభావమరచి ।నిర్విశేషభూత భావనుడగు ||వి.||

4. భూరిదయా న్వితుడాఖిల భూతనయుడు ।
పరిపూర్ణుడు ।దూరీకృత గుణదోషుడు
ధీరుడు నిరపేక్షితుడాతడు ।ఆత్మారాముడవై తన్ను తా
నూరకరమించు ।ఏరికాని కానబడడు ధారుణిశ్రీ దాసనుతుడు ||వి.||

---

1. యెంత ధన్యుడనైతి నౌరౌరా । ఇది యెంతో వింత ।
చింతలన్నియు తీరె నామది ।శ్రీ గురుకటాక్షమున
అంతటా పరిపూర్ణమైన చిదాత్మ తానని తెలిసికొంటిని || యెంత ||

2. తెలివి తానని మాటిమాటికి । తేటపడగా । నోటవలుకుచు।
తెలివి తానని తెలియనేరక । దేవుడన్యుడటంచు వలుకుచు తెలిసి
తెలియక ।వాదులాడేటి । తెలియనట్టివారిని చూచియు
దేశకుని రూపముగనియును।దేహ భ్రాంతులు విడిచిపెట్టితి।యెంత।

3. యెంతకాలము, ఆత్మ తెలియక, యెన్ని జన్మములెత్త
వలసెను । యెంత కాలమ్మునకు నా నిజమెరుగ గంటిని గురువు
దొరకుట || యెంత||

4. తెలియకను దేహేంద్రియాదులు । వలసి తమ తమ పనుల యందున చెలగె మీ సన్నిధిని చేరితి। తెరవు గాంచితి సాక్షి నైతిని తెలియని పనుడాయలేనికదృఢముగా నిశ్చయము తెలిసెను తెలియవలసినదేమిలేదిక। తెలియగల అర్థమును తెలిసెను ॥యెంత॥ ।

5. తల్లిదండ్రుల రుణము తీరెను! దైవ ఋషుల రుణంబు తీరెను యెంతకాలము సేవచేసిన నాకుసద్గురు రుణము తీరదు ॥యెంత॥

---

1) అంతా తాను సుమీ! ఈశ్వరుడంతర్యామి సుమీ! అంతా తానని ఆనందించిన!అతడే యోగి సుమీ! ఈశ్వరు డంతర్యామి సుమీ స్వాంతచిత్తుడై సతతమును! వేదాంత విచార స్వాంతుండై! విశ్రాంతి బొంది దురంత వికార భ్రాంతులులేక! అత్యంతము బాహ్యాభ్యంతర దృశ్యం బంతముజూచి, దృగంతంబని! ధీమంతుండై గురుచెంతకు చేరి! వితాంతంబున! యేకాంతుడై మంది సంతసించిన !అంతా!

2) కష్టముకాదు సుమీ! తనకే నష్టములేదు సుమీ! అష్టప్రకృతుణచిన! సర్వోత్కృష్టుడు తాను సుమీ! సిష్టాచార విశిష్టాచార ప్రతిష్టాద్వైక్య అభీష్ట పదంబున! నిష్టకలిగి కడుజుష్టుడు పరమకృష్టుడు అగుచు! నివ్వేష్టి సమిష్టులుగా ! స్పష్టమైన నిజదృష్టిని గని అవసిష్టము చేతను ద్రష్టయగుచు సంతుష్టిని బొందిన !అంతా!

3) గాథలుకావు సుమీ! తనకే బాధలులేవు సుమీ! సాధన వర్గము సాధించిన! ఈ సర్వము తాను సుమీ! సాధన సాధిత సద్గురునాథ కటాక్షం బోధిని తేలి విరోధములైన! అహంకార,కామ క్రోధోద్యఖిల! తత్వనిషేధములని! సదా పరిశోధకుడై! నిరుపాధినిగాఢ సమాధిని నిలచిన !అంతా!

4) వాస్తవమాత్మ సుమీ! మాయావైఖరి నాస్తి సుమీ! ప్రస్తుత వస్తు భ్రాంతి నశించిన బ్రహ్మము తానుసుమీ! అస్తోకైక స్వస్థి సమస్థాపాస్తి! సదా శుభమస్తిని! భేద నిజమస్తకమున గురుహస్త విదిత! చిద్వస్తువుగని! నిస్తూ రైక్య సుఖాస్తిని మాయాగ్రస్తుడుగాక సమస్త మెరిగియు !అంతా!

5) మోసముకాదు సుమీ! తనకాయాసము లేదు సుమీ!
శ్రీమత్ కులరామనాథ గురుశాసనమున విశ్వాసముంచి
పద్మాసనమున! సుఖాసీనుండై! భాసురతత్త్వాభ్యాసముచే
దరహాసము చేతను !అంతా!

---

1) అక్షయమై ఉండెడి సర్వాత్మ నీకే మంగళం
సాక్షాధిఖిలైక జగద్రక్ష నీకే మంగళం
2) పండువెన్నెలట్లు వెలుగు ప్రభువ నీకే మంగళం
బ్రహ్మాండమెల్ల నిండెడి యఖండతేజ నీకే మంగళం
3) ఆకృతి లేనట్టి సచ్చిదాత్మ నీకే మంగళం
అలవియె నిను కనుగొనుట అచలరూప మంగళం
4) భువన జాలములను చేయు పురుష నీకె మంగళం
భవ విధాతృహరి పండితపాద నీకె మంగళం
5) యెరుకయాఖ్యు నేలెడి జగదీశ నీకె మంగళం
పరమభక్త హృద్విలాస భవ్యగాత్ర మంగళం

---

1) గురువే సర్వస్వము - గురు కృపయే శరణము
గురు సేవే ధ్యేయము - గురునామమే దివ్యము !గురు!
2) సద్గురు ధ్యానము వినా సాటియైనదేమున్నది
సాక్షాత్కారము నొంది - తరించుటకు ఈ లోకంలో !గురు!
3) తనలోని లోకములను తనివితీర చూడలేక
బయటనున్న ఈ భువినే సత్యమని భ్రమ చెంది
అహంకార మమకారములకు లోనైన నాకు
అభ్యాస వైరాగ్యమనుదృష్టి ప్రసాదించిన !గురు!
4) ప్రజ్ఞానం బ్రహ్మమని వేదము ఘోషిస్తుంటే
అజ్ఞానము నెరిగెడి ఆ ప్రజ్ఞకూడ బ్రహ్మమని
తెలిసీ తెలియదని గ్రహించు తెలివీ ఒకటేనని
ఆ సాక్షిమాత్ర చిద్రూపుడ నీవే నేనని తెలిపిన !గురు!
5) దృష్టి దృక్కు దృశ్యములు తనలోనే కలవని
త్రిపుటిరహితుడైన తాను త్రికాల బాధ్యుడని
సర్వకర్మ స్వరూపము సచ్చిదానందములని
హా స్తవిదిత మస్తకమున చిద్వస్తువు దర్శింపచేసిన !గురు!

# శ్రీగురుదేవుల మేలుకొలుపు పాట

1. బ్రహ్మ ముహూర్తము వేళాయె ! గురుదేవా! బ్రహ్మానందముతోడా మేలుకో!
బ్రహ్మజ్ఞానామృత! పానమునొసగి మీ భక్తుల దరి
జేర్ప మేలుకో, గురుదేవా మేలుకో!
2. అజ్ఞానతిమిరము! అవనీతలమునెల్లా ! ఆవరించెను స్వామి ! మేలుకో
సుజ్ఞానమను జ్యోతి సూర్యోదయము! రీతి జూపి కాపాడంగమేలుకో!
గురుదేవా మేలుకో
3. సాధన దూరువై! సాధువుల్ కొందరు సత్యము విడచిరి! మేలుకో
సాధనంబులుతెలిపి! సన్మార్గమునుజూపి, సత్యము
నిలువంగ! మేలుకో! గురుదేవా మేలుకో!
4. ఆత్మ తేజములేక! అబలజనంబులు! అణగి పోయిరి తండ్రి మేలుకో
ఆత్మోద్దారణచేసి అబలల రక్షించి అవనీతలము నేలా మేలుకో! గురుదేవా
మేలుకో
5. కఠినులై మానవులే! దీన జీవుల బట్టి ఖండించుచున్నారు ! మేలుకో ! కఠిన
హృదయములెల్లా కరిగినీరై పోవా కరుణబోధింతువు మేలుకో! గురుదేవా
మేలుకో!!
6. ఆచరణములేని! వాచా వేదాంతము అంతటానిండెను! మేలుకో!
వాచామగోచర! సత్యజ్ఞానానంద! వైభవంబును జూప మేలుకో! గురుదేవా
మేలుకో!
7. శ్రీ సనాతన ధర్మ సేవాసమాజంబు స్థిరముగా వెలయింప మేలుకో!
పరమ మహాఋషుల! దివ్యోపదేశము! ధరణిపై వెదజల్ల మేలుకో! గురుదేవా
మేలుకో!
8. కర్మ భక్తి జ్ఞానాధ్యాన యోగంబుల మర్మములెరిగింప మేలుకో !
మర్మములైన! మహావాక్య సిద్దాంత మంత్రబోధన చేయ మేలుకో! గురుదేవా
మేలుకో!
9. అన్నిటికిని నీవే ఆధారమని నమ్మి నీఅండ చేరితినయ్యా మేలుకో !
అన్నిటికిని వెలియై - అన్నిటికిలోనై అన్ని యై యున్నావు మేలుకో!
గురుదేవా మేలుకో!
10. ధరణి వ్యాసాశ్రమ జామనీదగు పాద వరసేవా నొసగంగా మేలుకో
వరదా దాసాహృదయ సరసిజ భాస్కర కరుణా సాగరవేగ మేలుకో!
గురుదేవా మేలుకో!

రెండవ అనుబంధము

## ESSENCE OF GITA



*Why do you worry without any reason*
*Whom are you afraid of*
*Whatever has happened, has happened for the good*
*Whatever is happening, is happening for the good*
*Whatever will happen, will be for the good*
*Do not repent over the past*
*Do not worry for the future*
*Present is going on*

*what have you lost for which you cry*
*You did not bring anything when you were born*
*Whatever you have got, you had it from GOD*
*You came empty-handed and will go the same way*
*Whatever is yours today, was somebody else's yesterday*
*And will be somebody else's tomorrow*

*You are unnecessarily attached to your possessions*
*Alas! This ATTACHMENT IS THE ROOT CAUSE OF ALL YOUR SUFFERINGS*
*Treat all your possessions as TRUST PROPERTY*
*Given to you by GOD*
*Let the thoughts about 'mine', 'yours', 'my own', 'someone else's'*
*Be wiped off from your mind*
*Then everything is yours and you belong to everyone*

*CHANGE IS THE LAW OF NATURE*
*Neither this body is yours, nor you belong to the body*
*The body is composed of fire, water, air, earth and etheral fluid*
*And it will dissolve into these*
*But the soul in You is immortal*
*It neither takes birth nor it dies*

*Surrender yourself to GOD*
*That's the best "Support"*
*One who knows about this "Support"*
*Becomes free from all fears, anxieties, and sorrows*
*Whatever you do, dedicate it to GOD*
*By doing selfless work You will experience Bliss*
*And will attain Salvation*

**Lord Krishna**

## మూడవ అనుబంధము

# జ్ఞాన రత్నాలు

1. నేనే దేహమని దేహవాసన ఉన్నంతవరకు మోక్షము కలుగదు.

2. నీవు బంధించుకున్న బంధాలే నీ జన్మకు కారణం. అవి ఎవరో బంధించినవి కావు. అందుచే నీ బంధాలని నీవే విడిపించుకొని మోక్షం పొందాలి.

3. బంధాలలోనుండి విడివడటమే మోక్షం.

4. బయట వెతుకున్నంతవరకు పరమాత్మ దర్శనంకాదు.

5. ఈ దృశ్యమాన జగత్తులోని విషయాల పైకి ఇంద్రియాలు పరుగెత్తినంతవరకు ప్రతిబంధకమే. జ్ఞానప్రాప్తికాదు.

6. యజ్ఞయాగాదులు, సత్కర్మలు, తీర్థ యాత్రలు మొదలగునవన్ని వాసనాక్షయానికి చిత్తశుద్ధికి తోడ్పడుతాయి తప్ప స్వస్వరూప జ్ఞానంకలుగదు.

7. కర్మోపాసన జ్ఞానానికి విరుద్ధం. అజ్ఞానం నశిస్తే కాని జ్ఞానప్రాప్తి కలుగదు.

8. ఇది నాది, నీది, అన్ని విషయాలమీద అభిప్రాయాలు రూఢి చేసుకొని కర్మలాచరించటం. బంధహేతువే.

9. భూతకాలవిషయాలను భవిష్యత్తులో జరుగబోవు వాటిని చింతిస్తూ కూర్చోవటం అవివేకం. వర్తమానంలో ఉండి జ్ఞానమార్గంలో పయనించు.

10. నీవు జన్మించినపుడు వట్టి చేతులతో వచ్చావు. పోయేటప్పుడు అన్నీ వదిలి పోతున్నావు. బతికి ఉన్న నాల్గురోజులు ఇవి కావాలి అవికావాలి అని కోర్కెలు, ఆశలు పెంచుకొని జన్మపరంపరలో చిక్కుకోవటం ఎందుకు.

11. పెట్టి పోషించిన నీ శరీరమునే వదలి పెట్టి పోతుంటే అట్టి శరీర సంభంధీకుల మీద మోహమెందుకు.

12. సోమరితనమే తన శత్రువు.

13. తృష్ణయే సంసారపాశము.

14. అమిత కోర్కెలు గలవాడు శ్రీమంతుడయినను దరిద్రుడు.

15. విషయవాంఛల యందు కోర్కెలు నశింప చేసుకున్నవాడు ధనవంతుడు.

16. పుణ్యఫలము సుఖము. పాపఫలము దుఃఖము.

17. పరమాత్మను చూశాను అన్నవాడు చూడనట్లే. పరమాత్మ అవాఙ్మానస గోచరుడు. ఈ చర్మచక్షువులతో చూడలేరు.

18. పరమాత్మ నిరాకారుడు - సర్వవ్యాపి - సర్వాంతర్యామి అని ఉపనిషత్తులు ఘోషిస్తుంటే నీలో ఉన్న పరమాత్మ కోసం బయట పరుగెత్తటం ఎంత హాస్యాస్పదం.

19. జగత్తుకు అధిష్ఠానము పరబ్రహ్మ. జగత్తు బ్రహ్మకంటే వేరుకాదు. అజ్ఞాన భ్రాంతి వలన త్రిగుణాలతో నిండిన జగత్తులోని విషయానందం కొరకు కర్మలు చేసి జన్మ పరంపరలలో చిక్కుకొన్నావు. చేయవలసిన దల్లా జగద్భ్రాంతివదలటమే. పరమాత్మ దర్శనమవుతుంది.

20. నీలోనున్న ఆత్మ ఇతర జీవరాశులలో నున్న ఆత్మవేరుకాదు. సర్వాత్మ భావన చేసి ప్రేమ అభివృద్ధి చేసుకో.

21. భేద భావనే అవిద్య. నామ రూపాలమీద ఆసక్తి పెంచుకున్నంతవరకూ మోక్షము కలుగదు.

22. తీవ్ర వైరాగ్యమే మోక్షసాధనకు శరణ్యం.

23. వైరాగ్యమంటే భార్య పిల్లలను వదలి కాషాయ వస్త్రాలు ధరించి అరణ్యాలకు పోవటము కాదు. జగత్తులోని విషయవాంఛలను విడనాడటం దేహ వాసన వదలటమే వైరాగ్యం.

24. అసత్యవస్తువును సత్యవస్తువు అనే భ్రమనుండి బయటపడి, ఆభ్రమచే కలిగిన సకల వాసనలు త్యజించటమే వైరాగ్యము.

25. ఎంతో పూర్వ జన్మల పుణ్య పరిపాకమువలన గాని తీవ్ర వైరాగ్యము, ముముక్షత్వము లభింపవు.

26. ఉన్నది త్రాడే కాని (అజ్ఞానంలో) చీకట్లో దానిని పాముగా భ్రమించి భయకంపాలకు లోనయ్యావు. ఆ స్థితిలో పాము సత్యమే. దీపకాంతి చూపించగానే అప్పటి వరకూ ఉన్న పాము త్రాడులో లీనమయింది. అదే విధంగా సద్గురువు ద్వారా స్వస్వరూప జ్ఞానం కలుగనంతవరకూ త్రిగుణాలతో నిండిన జగత్తు గోచరిస్తుంది. ఆత్మ సాక్షాత్కారం, (స్వస్వరూపజ్ఞానం) పొందిన జ్ఞాని జగత్తుని బ్రహ్మమయంగా చూస్తాడు.

27. కర్మ బంధాలు జ్ఞానాగ్ని చేతనే (స్వస్వరూపవిజ్ఞానము చేతనే) దహింప బడుయి కాని సకామ్యకర్మలు, యజ్ఞయాగాదులవల్లకాదు.

28. దీపం ఉన్నచోట చీకటి ఉండదు. అదే విధంగా జ్ఞానోపాసికి కర్మోపాసన పనికిరాదు. జ్ఞానం కలగటానికి తనలోని అజ్ఞానాన్ని నిర్మూలించుకోవాలి.

29. చిదా భానుడు పరమాత్మకన్న భిన్నుడుకాడు. సూక్ష్మ శరీరము (అంతఃకరణ) భంగమవుతే చిదాభానుడు పరమాత్మలోనే లయమవుతాడు.

30. సూర్యప్రకాశంవలన కొందరు శృంగార నవలలు చదువుతారు. కొందరు సద్గ్రంథ పఠనం చేస్తారు. కొందరు స్వస్వరూపజ్ఞానం పొందటానికి ధ్యాననిమగ్నులై ఉంటారు. వారి వారి ఉపాధులబట్టి. వారు చేస్తున్న కర్మలన్నిటికి సూర్యుడు సాక్షి. అదేవిధంగా అంతర్యామిగా ఉన్న పరమాత్మ ఆయన చైతన్య శక్తివల్ల బుద్ధి మనస్సు ఇంద్రియాల కార్యకలాపాలకు సాక్షిగా చూచున్నాడే కాని ఆకర్మలకు బద్ధుడు కాడు.

31. సాక్షికి సంఘర్షణ పడుతున్న వ్యక్తులతో సంబంధం లేనట్లు మనోబుద్ధి అహంకారాల వలన జరిగిన కర్మలకు సాక్షికి సంబంధము లేదు. ఆ సాక్షి చైతన్యమే "నేను".

32. మోక్షగామి పురుషయత్నంలో దైవీ సంపదను అలవరచు కోవాలి. అసురసంపదను విడనాడాలి.

33. నీవు పంచకోశ విలక్షుణుడవైన సాక్షివి. అదేవిధంగా శరీరత్రయమునకూ సాక్షివే.

34. "నేను" "నేను" స్వస్వరూపవిజ్ఞానం తెలుసుకోకుండా దానికి ప్రయత్నించకుండా ఇంద్రియలోలుడై మానవ జీవితము వ్యర్థము చేయరాదు.

35. అవిద్య కారణంగా విషయ వాంఛలతో కూడిన మనస్సు బంధ హేతువు. మలిన వాసనలు త్యజించిన శుద్ధమనస్సు మోక్షహేతువు. కాబట్టి బంధమోక్షాలకు మనస్సే కారణం. చేయవలసిన వనంతా పురుషయత్నంతో మనస్సు శుద్ధ పరచుకో. ఇందులో కష్టమేముంది.

36. పరమాత్మకు నీకు (అంతఃకరణ) మనస్సే అడ్డు. మనస్సును తొలగిస్తే నీవు పరమాత్మవే. అందుచే మనస్సుని శుద్ధపరచుకొని జాగ్రదావస్థలోనే నిస్సంకల్ప స్థితిలో ఉండి "అహంబ్రహ్మాస్మి" అనే మహావాక్యార్థము తదాకార వృత్తిలో ధ్యానంచేస్తూ స్వస్వరూప విజ్ఞానము పొందు.

37. ముముక్షువు సంసారంలోనే ఉంటూ సంసారం తనలో ప్రవేశించకుండా జాగ్రత్తపడుతాడు. అది ఎలాగ అంటే నావ నీళ్లలోనే ఉండాలి. నీరు నావలోకి రాకూడదు.

38. మనస్సునకు వెలుపల వేరొక అజ్ఞానములేదు. మలిన వాసనలు కలిగి భ్రమచే భేద బుద్ధి కలిగిన మనస్సే అజ్ఞానము.

39. అన్ని జీవులు స్వాభావికముగా కేవలము శుద్ధ చైతన్యమే. "జీవో బ్రహ్మావనాపరః" దీనికి విరుద్ధముగా బేధబుద్ధి కలిగి ఉండటం అజ్ఞానమే.

40. ఒక నిర్మలమైన స్ఫటికంవద్ద ఎర్రని పుష్పాలు పెడితే స్ఫటికం కూడా ఎర్రగా కనిపిస్తుంది. కాని స్ఫటికానికి ఏవిధమయిన నష్టములేదు. అదే విధంగా

ప్రత్యగాత్మ సామీప్యంలో ఉంటున్న మనోబుద్ధి అహంకారాలు ప్రత్యగాత్మ ఆచైతన్య శక్తి వలన పని చేస్తున్న వాటి కర్మలు ప్రత్యగాత్మముకు (నేను) సంబంధము లేదు. అయస్కాంతము దగ్గిర చిన్న చిన్న ఇనుప వస్తువులు కదిలినట్లుగా.

41. అలల ప్రవాహం తగ్గిన తర్వాత సముద్రం స్నానం చేద్దామని కూర్చోవటం అవివేకం. అలలు తగ్గవు. స్నానము చేయలేవు. అందుచేత అలల తాకిడి లేని సమయం చూసుకొని గబుక్కున స్నానం చేయాలి. అదే విధంగా సంసార సాగర తీవ్రత తగ్గిన తర్వాతా వృద్ధాప్యములో మోక్షసాధనకు ప్రయత్నించవచ్చని కూర్చోవటం అవివేకం. చిన్నప్పటినుండి శక్తి ఉండగానే సంసారంలో నే ఉంటూ, సంసారానికి అంటుకోకుండా, మనోభావన మార్చుకుంటూ, సద్గురు బోధవల్ల తత్త్వజ్ఞానము పొంది స్వస్వరూప విజ్ఞానానికి తీవ్ర సాధన చెయ్యాలి.

42. పూర్వజన్మ కర్మ ఫలితాలవల్ల కష్టాలు ఎలా వచ్చాయో సుఖాలు కూడా ఆవిధంగానే వస్తాయి. అది అనివార్యము. దుఃఖ నివృత్తికి, సుఖ ప్రాప్తికి భగవంతునితో మొక్కుబడులని బేరాలాడటం అవివేకం.

43. సుఖాలయినా కష్టాలయినా ఉదాసీనంగా వాటిని శరీరాని వదలిపెట్టి వాటికి చలించక సాక్షిగా దైవ ప్రసాదాలుగా ఎంచినవాడు యోగి.

44. ఆత్మ పుట్టేదీకాదు. చచ్చేదికాదు. 'శాశ్వతోయం - అవినాశి' "నేను నేను" అనేది సంభోధించేది అదే. అది గుర్తించి స్వస్వరూప విజ్ఞానం పొందటమే జీవిత పరమావధి.

45. సత్సాంగత్యము పూర్వజన్మ పుణ్యపరిపాకము వలన గాని కలుగదు. ముముక్షువుకు ఇది అత్యవసరము.

46. కర్తృత్వ రహితంగా, నిష్కామంగా, భగదర్పణం చేస్తూ కర్మలు చెయ్యాలి. అవి బంధనాలు కావు.

47. తండ్రిని ఋణము మొదలైన వాటినుండి పుత్రాదులు విడిపింప గలరు. కాని తన బంధములు తనకు తానే విడిపించుకోవాలి. శతకోటి కల్పములకైనా ఇతరులవలన కాదు.

48. నాస్తికులు కళ్లుండియు గుడ్డివారే.

49. కామాతురుడు మహాంధుడు.

50. సంసార దుఃఖము బోగొట్టునది వేదోక్తమగు ఆత్మ భోదే.

51. దీర్ఘ రోగము సంసారమే. దానికి విచారమే మందు.

52. తన ఇంద్రియాలే తనకు శత్రువులు. వశీభుతముల్తైన తన ఇంద్రియాలే తన మిత్రులు.

53. ప్రారబ్దమే శరీరము నిలబెట్టుతుంది.

54. అధిక తృష్ణ కలవాడు ధనవంతుడయిననూ దరిద్రుడు. సర్వదాతృప్తితో ఉండువాడు ధనవంతుడు కాకపోయిననూ లక్ష్మీయుతుడు.

55. ఇతరులు నీకు ఏదిచేస్తే అసౌకర్యము అవుతుందో అటువంటి పనులు ఇతరులకు చేయకు.

56. భగవంతుడు సృష్టించిన పుష్పాలు ఫలాలు ఆయనకే సమర్పించటంలో ఘనత ఏముంది. నీలో ఉన్న అహంకారాన్ని ఆయనకు సమర్పించు కృతార్ధుడవుతావు.

57. ఈ విశ్వభువన భోనాంతరాళలో భూమి గ్రహమెంత? అందులో ఆసియా ఖండమెంత. అందులో నీ భారతదేశమెంత? అందులో నీ గ్రామమెంత? అక్కడి నీ ఇల్లు ఎంత? ఆ ఇంటిలో నువ్వెంత. వాటితో పోల్చితే నీవు కేవలము అణుమాత్రుడవు. ఇది మరచి ఎందుకు అహంకరిస్తావు. వినయ నమ్రతలు అలవాటు చేసుకుంటూ సర్వాత్మ భావనచేయి.

58. మనస్సు ఒక పిచ్చికోతి లాంటిది. కుక్కలాగా అటూ ఇటూ పరుగెడుతూ వ్యర్ధమయిన దుస్సంకల్పాలతో ఉంటుంది. దానికి ఏదో ఒక ఆలంబన కావాలి కాబట్టి. బలవంతంగా పురుషయత్నంతో దాన్ని పరమాత్మపై అంతర్ముఖం చేసి "అహంబ్రహ్మాస్మి" అనువాక్యార్ధముపై లగ్నం చేసి స్థిర పరచు. ఆ అనందం అనుభవిస్తే అది ఇక వదలిపెట్టదు.

59. నామ రూపాలపై భ్రమతో వాసనలు ఏర్పరుచు కొని వాటిని రూఢి చేసుకుంటే బద్ధుడవవుతావు. నీకు ఒక పళ్లెంలో రకరకాలయిన పంచదారతో చేసిన పక్షులు, జంతువులు పెట్టారనుకో. అందులోని పంది ఆకారములో ఉన్న దాన్ని తీసుకోవు. చిలక ఆకారంలో ఉన్న దాన్ని తీసుకుంటావు. ఎందుకంటే పందిని ఏహ్యావస్తువుగా ఇదివరకే రూఢిచేసుకున్నావు కాబట్టి. అందులో ఉన్న పంచదార ఇతర చిలకలలో ఉన్న పంచదార ఒకటిఐనప్పటికి దానికి ప్రాధాన్యత ఇవ్వక నామరూపాలకై ప్రాధాన్యత ఇచ్చావు కాబట్టి. కాబట్టి నామరూపాలమీద దృష్టి పోగొట్టుకొని, సర్వాత్మబావన చేయనంతవరకు ఆధ్యాత్మిక మార్గంలో పురోగమించలేవు.

60. ఈ దేహం లేనిదే నీ స్వస్వరూపజ్ఞానం తెలుకోలేవు. కాని ఆదేహం నీవుకాదు.

61. సిద్దులు వాటి మహత్తు ప్రకటించటం జ్ఞాని లక్షణం కాదు. వాటిని కూడాతృణీకరించాలి.

62. ఒకనిని నీటిలో ముంచి అదిమి పడుతే బయటకు రావడానికి ఎంత తపన పడతాడో అంత తపన పరమాత్మ పై పెట్టు. ఆయనే సద్గురు రూపంలో నీకు తత్త్వ బోధ చేసి తరింప చేస్తాడు.

63. ధర్మాన్ని నువ్వు రక్షించు. ధర్మం నిన్ను రక్షిస్తుంది.

64. ఆత్మ సాక్షాత్కారము పొందని జీవితము వ్యర్థము రాజమానతను బోదించు విద్య కలిగినను, అత్యధిక ధనవంతుడైనప్పటికి, పెక్కు దేశములు తిరిగినప్పటికి, సుందరాంగియైన రమణులతో భోగించినప్పటికి, ఇష్టులైన బంధువర్గమును పోషించి పేరు గడించినప్పటికి, ఎటువంటి పుణ్యానదులలో స్నానమాచరించినప్పటికి, కోటి మంత్రజపములు చేసినను, అనేక దాన ధర్మములు చేసి ఖ్యాతి గడించినా, గానములో సమర్థత ఉన్నప్పటికీ, విప్రులకు అన్న భోజనములతో సంతోష పెట్టినా, దేవతలకు యజ్ఞ యాగాదులు చేసి తృప్తి పరచినా, ఉపవాసములు చేసి, యోగ సిద్ధులు పొందినను, వంశాభివృద్ధి అగు పుత్రులను బడసిననూ, విషము పాలవలె త్రాగ గలిగినను, నిప్పులను పేలాలవలె తినగలిగిననూ, పక్షివలె ఆకాశము నందు ఎగుర గలిగిననూ, స్వర్గమున దేవేంద్ర పదవిలభించినా, ఉర్మియందు రాజేంద్ర పదవి లభించినా, అరిషడ్వర్గములు జయించినా, మోహము, గర్వము, మాత్సర్యము మొదలగు అసుర గుణములు త్యజించిననూ, బ్రహ్మ, విష్ణు, శివలోకములను పొందిననూ, ఆత్మసాక్షాత్కారము, (స్వస్వరూపము) పొందకుండిన అన్నియూ వ్యర్థములు. ఆత్మ సాక్షాత్కారము పొందుటయే మానవ జన్మ పరమావధి.

# నిర్వాణషట్కమ్
## (ఆత్మ షట్కమ్)



మనోబుద్ధ్యహఙ్కార చిత్తాని నాహం
న శ్రోత్రం న జిహ్వానచ ఘ్రాణనేత్రమ్,
న చ వ్యోమ భూమి ర్న తేజో న వాయు
శ్చిదానన్దరూపః శివోఽహం శివోఽహమ్

అహం ప్రాణసఙ్జ్ఞో న వై పఞ్చవాయు
ర్న వాసప్తధాతు ర్న వా పఞ్చకోశః,
న వాక్ పాణి పాదౌ న చోపస్థపాయూ
చిదానన్దరూపః శివోఽహం శివోఽహమ్.

న పుణ్యం న పాపం న సౌఖ్యం న దుఃఖం
న మన్త్రో న తీర్థం న వేదా న యజ్ఞాః,
అహం భోజనం నైవ భోజ్యం న భోక్తా
చిదానన్దరూపః శివోఽహం శివోఽహమ్.

న మే ద్వేషరాగౌ న మే లోభమోహౌ
మదో నై వ మే నై వ మాత్సర్యభావః,
న ధర్మోనచార్థో న కామో న మోక్ష
శ్చిదానందరూపః శివోఽహం శివోఽహమ్.

న మృత్యు ర్న శఙ్కా న మే జాతిభేదః
పితా నైవ మే నైవ మాతా న జన్మా,
న బన్ధు ర్న మిత్రం గురు ర్నైవ శిష్య
శ్చిదానన్దరూపః శివోఽహం శివోఽహమ్.

అహం నిర్వికల్పో నిరాకారరూపో
విభుత్వాచ్చ సర్వత్ర సర్వేన్ద్రియాణామ్,
న వా బన్ధనం నైవ ముక్తి ర్న బన్ధః
చిదానన్దరూపః శివోఽహం శివోఽహమ్.